Nā Cyprus Yātra

(Travelogue)

by

Dr. N. Gopi

First Published: **2001**

Cover Design: **Laxman Aelay**

Price: **Rs. 30/-**

For Copies
**Smt. N. Aruna,**
13-1/5B, Srinivasapuram,
Ramanthapur, Hyderabad -13
Phone: 7037585
and
**Visalāndhra Publishing House**
4-1-435, Bank Street,
Vignan Bhavan, Hyderabad-500 003
and its Branches

Letter Setting:
**Om Teja Graphics,**
3-13-1/4B, Srinivasapuram,
Ramanthapur, Hyd-13
Ph: 7035196

Printed at
**Vipla Computer Services**
(Designers & Multi Colour Offset Printers)
Nallakunta, Hyderabad. Ph: 7673309

# అంకితం



ఆరేళ్ల స్నేహమే అయినా
అరవయ్యేళ్ల సాన్నిహిత్యం ఏర్పడిన వైనం మాది.
నిబ్బరం, నిర్భీకత, ఆత్మీయత, కార్యదీక్ష
చతుశ్శాఖలుగా ఎదిగిన హరిత వృక్షమితడు.
అనేక సన్నివేశాలను పంచుకున్నాం
అలజడిలో కూడా అలవిమాలిన సంస్కార పుష్పమితడు.
నా వరంగల్ మిత్రుడు
నల్లగొండ జిల్లాకు ఆదరపాత్రుడు
"చిగురుకలలు" కవి
**కపిలవాయి దిలీప్‌కుమార్‌కి**
ఈ రచన అంకితం

ఈ యాత్రాచరిత్ర పుస్తకరూపంలో రావటానికి

దోహదం చేసిన సోదరీమణి

**శ్రీమతి కె. నాగరత్నంగారికి**

*(నా చిరకాల మిత్రుడు కె. నాగయ్యశెట్టిగారి అర్ధాంగి)*

శుభాకాంక్షలు.

# నా మాట

ప్రయాణం జీవనయానంలో అత్యంత చలనశీలభాగం. నిత్య యాంత్రికత లోంచి శుష్కమైన ఆలోచనలకు బ్రేక్. రాహుల్ సాంకృత్యాయన్ నాటి కాలినడక ప్రయాణమైనా, ఈనాటి గాలిలో విహారమైనా మానవుని మౌలికమైన ఉద్వేగం ఒకటే.

ఎక్కడో ఏడువేల మైళ్ల దూరంలో మధ్యధరాసముద్రం. కొత్త సముద్రమంటే కొత్త వాతావరణం, కొత్త సంస్కృతి. దాన్ని నా బంగాళాఖాతానికి ముడివేయకపోతే ఎలా? అందుకే ఈ రచన.

కమ్యూనికేషన్ల వ్యవస్థ విపరీతంగా పెరగటంవల్ల యాత్రా చరిత్ర రచన తగ్గిపోయిందని అంటున్నారు. అదేమోగాని ఏ సమాచారం తెలిసినా ప్రత్యక్షానుభూతిని మించదు.

చాలా సమయపేదరికంతో('బిజీ' అనను) సతమతమవుతున్న కాలంలో (రెండు విశ్వవిద్యాలయాలకు వి.సి.గా ఉండవలసి రావడం, కాకతీయకు ఫుల్ ఎడిషనల్ ఇన్‌చార్జి) రాత్రుళ్లు దొరికిన కొద్దిపాటి సమయంలో నా అర్ధాంగి అరుణ ప్రోత్సాహంతో ఈ రచన జరిగింది. నేను డిక్టేట్ చేస్తుంటే ఆమె ఓపిగ్గా రాసింది. లేకపోతే ఈ జ్ఞాపకాల తాజాదనం కాలధర్మంలో కలిసిపోయి ఉండేది. ఆమెకు నా శుభాకాంక్షలు.

అలాగే ఎప్పటికప్పుడు రాసిన భాగాలను డి.టి.పి. చేస్తూ, తర్వాతి భాగాలను రాయటానికి ఉత్సాహం కలిగించిన ఓం తేజ గ్రాఫిక్స్ అధినేత్రి చిరంజీవి శ్రీమతి ప్రసూనకు నా ఆశీస్సులు. మ్యానుస్క్రిప్టు దశలో ఉన్నప్పుడు ఓపిగ్గా చదివి అభిప్రాయాలు చెప్పిన ఆచార్య టి. గౌరీశంకర్, డా. సి. మృణాళిని, డా. జె. చెన్నయ్య, ఎస్. రఘులకు నా అభినందనలు.

దీనిని ఐదువారాలపాటు ధారావాహికంగా ప్రచురించిన ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక ఎడిటర్ , ప్రియమిత్రుడు వల్లూరి రాఘవరావుగారికి ఎన్ని కృతజ్ఞతలు చెప్పినా తక్కువే.

ఎప్పటిలాగే అందంగా ముద్రించియిచ్చిన విష్లా ప్రింటర్స్ అధినేత విజయసేనారెడ్డిగారికి నా కృతజ్ఞతలు-

– గోపి

సైప్రస్ దేశంలో 2001 ఏప్రిల్‌లో కామన్‌వెల్త్ వైస్‌ఛాన్స్‌లర్స్ కాన్ఫరెన్స్ జరిగింది. అసోసియేషన్ ఆఫ్ కామన్‌వెల్త్ యూనివర్సిటీస్ ఆధ్వర్యంలో ఏప్రిల్ 22 నుండి 26 వరకు ఇది జరిగింది (ACU Conference of Executive Heads, Cyprus). ఎ.సి.యులో కామన్‌వెల్త్ దేశాల విశ్వవిద్యాలయాలన్నిటికి సభ్యత్వం ఉంది. మూడేళ్ళకోసారి ఈ కాన్ఫరెన్స్ జరుగుతూ ఉంటుంది. ఈసారి మధ్యధరా సముద్ర దేశమైన సైప్రస్‌లో ఏర్పాటు చేశారు. ఇది ఆ సముద్రంలోని ఒక చిన్న అందమైన ద్వీపం. దీనికి దిగువన టర్కీ, పశ్చిమాన సిరియా దేశాలున్నాయి. ఈ కాన్ఫరెన్స్ నిర్వహణ బాధ్యతను సైప్రస్ విశ్వవిద్యాలయం చేపట్టింది.

ఏప్రిల్ 19రాత్రి బయల్దేరాం. నేను, జె.యన్.టి.యు. వి.సి. ప్రొఫెసర్ వెంకట్రామారెడ్డి, అగ్రికల్చరల్ యూనివర్సిటీ వి.సి. ప్రొఫెసర్. ఐ.వి. సుబ్బారావు ముగ్గురం ఒక జట్టుగా బయల్దేరాం. మా ప్రయాణాన్నంతా ప్లాన్ చేసింది ఒకే ట్రావెల్ ఏజెన్సీ. నాగార్జున యూనివర్సిటీ వి.సి. ప్రొఫెసర్ రాఘవులు మాతో కలువవలసి ఉండింది. కాని ఆంధ్ర విశ్వకళా పరిషత్తుకు ఇన్‌ఛార్జి వి.సి.గా నియమించబడటం వల్ల ఆయన కార్యక్రమానికీ మాకూ తేడా వచ్చింది. కాబట్టి ఆయన ఒకరోజు ముందుగా బయలుదేరి అలాగే ఒకరోజు ముందు తిరిగి వచ్చి ఆంధ్ర విశ్వకళా పరిషత్తు స్నాతకోత్సవంలో పాల్గొనవలసి ఉంది. ఆయన మాతో కలిసి ప్రయాణించలేకపోయినందుకు ఆయనకూ మాకూ నిరుత్సాహం కలిగింది. రాఘవులుగారు సరదా మనిషి.

పాశ్చాత్యదేశాల పోకడలు తెలిసినవాడు. ఆ మేరకు ఆయన సాంగత్యాన్ని కొంత నష్టపోయ్యాం.

# హైదరాబాద్ సే ముంబయి తక్

స్ప్రెస్‌కు వెళ్లాలంటే ముంబాయ్ దుబాయిల మీదుగా వెళ్లాల్సి ఉంది. ఇదొక రూటు. మాకిదే కుదిరింది. దుబాయిలో ఒకరోజు ఆగాలి. ఈ రూటులో వెళ్తే ఖర్చు కొంత తక్కువవుతుంది. రాత్రి 9.45కు బేగంపేట విమానాశ్రయం నుండి ముంబాయికి ఫ్లైటు. ఎయిర్‌పోర్టుకి నా భార్య, మా అబ్బాయి, కోడలు వీడ్కోలు పలకటానికి వచ్చారు. మా రిజిస్ట్రార్ ఆచార్య ఎన్. శివరామమూర్తి, ఆర్థికాధికారి యమ్. దేవేందర్, డి.ఆర్. గంధం సుబ్బారావు, ప్రజా సంబంధాల అధికారి డా. జె. చెన్నయ్య, నా కార్యదర్శులు డా. సుధాకర్ నాయుడు, పుల్లంరాజు, ఇంకా సమద్, సోమయ్య, చంద్రశేఖర్‌రెడ్డి, రఘు, ఆనంద్ తదితరులు వచ్చారు. కాకతీయ విశ్వవిద్యాలయం వి.సి. మేడం విద్యావతి ఎయిర్ పోర్టులో కలిశారు ఆమె వేరే ట్రావెల్ ఏజెన్సీ ద్వారా వస్తున్నారు.

పది గంటలకు జెట్ విమానం లేచింది. బాగా అలిసిపోయి ఉన్నాను. బయలుదేరేముందు దాకా ఫైల్స్ చూస్తూనే ఉన్నాను. నాతోటి వి.సి.ల పరిస్థితి కూడా అదే. వాళ్లయితే సరాసరి ఆఫీసునుంచే వచ్చారు. ఈ రోజుల్లో వి.సి. పదవులు పైకి కనిపించేటంత అందమైనవి కావు. అనేకానేక లంపటాల వలయాలు. సంక్షోభ సమన్వయ సమన్వితాలు. ఎన్నో ఏజెన్సీల ముళ్లపొదల్లోంచి విద్యావికాస పుష్పాలను పూయించవలసి ఉంటుంది. హైదరాబాద్ నుంచి ముంబాయికి గంట ప్రయాణం. అలసిపోయి ఉన్నాను కాబట్టి మరింత అలసిపోవలసి ఉంటుంది కాబట్టి ఆరోగ్యం గురించి కాస్త భయం. అందుకే విమానంలో సర్వ్ చేసిన డిన్నర్‌లో వెజిటేరియన్ తిన్నాను. ఈ జాగరూకత ఏపాటి నిలుస్తుందో చూడాలి.

ప్రయాణం నాకెప్పుడూ ఉద్వేగభరితంగానే ఉంటుంది. ప్రయాణంలో నేను నిలువెల్లా కవిత్వమైపోతాను. సైప్రస్‌లాంటి అందమైన ప్రదేశానికి నా భార్యనుకూడా తీసుకొనివెళ్తే బావుండుననిపించింది. కాని నాకా స్తోమత లేదు. ఏ కొద్దిమందికో తప్ప చాలామందికి ఉండదు. సైప్రస్‌లో వెంట వచ్చేవారికి కూడా (accompanying persons) అతిథి సౌకర్యాలు ఏర్పాటు చేశారు కాబట్టి ఈ కాస్తా పీకులాట. సుబ్బారావుగారితో అంతకుముందు వి.సి.ల సమావేశాల్లో పరిచయం ఉందికానీ ఇప్పుడు వందల గంటలు గడపబోతున్నాం. ఆయనకీమధ్యే రెండో టర్మ్ కూడా వచ్చింది. మంచి వ్యవసాయవేత్త, పెద్దమనిషి. ఆయనతో మాటలు కలుపుతూ "మీది అగ్రికల్చర్ అయితే మాది కల్చర్" అన్నాను. దానికాయన "గోపిగారూ! అన్ని కల్చర్లకు మూలం అగ్రికల్చరే కదా" అన్నారు. ప్రొఫెసర్ వెంకట్రామారెడ్డి ఆ కాస్త గంట ప్రయాణంలో అరగంట కునుకుతీశాడు. అదృష్టవంతుడు. ఆయన ఇదివరకే భూగోళంపైన చాలాభాగం తిరిగొచ్చాడు. ఆయనలో థ్రిల్లంతా ఖర్చయిపోయిందనుకాని, అలసట. రెడ్డీ నేను సమవయస్కులం కాబట్టి అన్నా అన్నా! అనుకునే అలవాటు. మొదటినుంచీ అందరికంటే మేం ఎక్కువ సన్నిహితులమయ్యాం. దేశంలోనే Youngest Vice-Chancelor లం మేం. నేను Young అంటే నేను అని వాదులాడుకుంటాం.

ప్రయాణంలో నాకు నిద్రపట్టదు. పట్టబోయినా పట్టనివ్వను. నా భార్య ఉంటే భావాలను ఎగరేస్తుండేవాడిని. విమానప్రయాణం నన్ను భూమిగురించి మరింత ఆలోచించేలా చేసింది. దిగువ మధ్యతరగతి వాడిలో ఉన్న ఆశ్చర్యమూ, ఆస్వాదన శక్తీ నాలో కొరవడలేదు. అవకాశాల్లోని ఆనందాన్ని నేను యాంత్రికంగా తీసుకోలేదు. తాజాగా ఉండటం, తాజాగా ఆలోచించడం మా గురువుగారు నారాయణరెడ్డిగారిలో చూశాను. పాతబడితే నిరంతరంగా అంత కవిత్వం ఎలా రాస్తారు? విదేశీ పర్యటన అవకాశం ఇది నాకు రెండోసారి. ఇదివరకు మారిషస్ వెళ్లాను. అదంతా ఒక కలలా జరిగిపోయింది. ఆ పర్యటనను "నేను చూసిన మారిషస్" అంటూ

యాత్రాచరిత్రగా రాశాను. వివిధ ప్రదేశాలు తిరగటం అందరికీ వీలయ్యేపనికాదు. అందుకే నేను ఎన్నో యాత్రాచరిత్రలు చదివి ఆయా ప్రదేశాలను ప్రత్యక్షంగా చూసిన తృప్తిని పొందాను. యాత్రాచరిత్రల మీద వచ్చిన ఓ సిద్ధాంతగ్రంథానికి పర్యవేక్షకుడిగా కూడా ఉన్నాను.

విమానం ఎత్తును దించుకుంటున్నట్టు తెలుస్తూనే ఉంది. ముంబాయిని సమీపిస్తున్నాము. ఇది రాత్రి కాకుండా వుంటే పశ్చిమ పర్వతపంక్తులు (Western ghats) కనిపించేవి. పరుచుకున్న సముద్రం పక్కన ముంబయి నగరం రొంబ అందంగా కనబడేది. సరిగ్గా పదకొండు గంటలకు ఛత్రపతి శివాజి డొమెస్టిక్ ఎయిర్‌పోర్టులో దిగాము. బ్యాగేజిని గుర్తించడం వంటి యాంత్రిక కృత్యాలన్నీ జరిగిపోయాయి. అక్కడినుంచి సహారా అంతర్జాతీయ విమానాశ్రయానికి వెళ్లాలి. ట్రావెల్స్‌వారి కారు మాకోసం వేచివుంది. ముంబయిలో నా మిత్రుడు, ముంబయి ఆంధ్ర మహాసభ అధ్యక్షుడు కొత్తపల్లి రమేష్‌బాబు, మల్లికార్జున్‌రెడ్డితోపాటు నన్ను కలవటానికి వచ్చాడు. తిరుగు ప్రయాణంలో ముంబయిలో దిగినప్పుడు వాళ్ల యింటిలో లంచ్ చేయాలన్నది ఆయన ప్రణయ నిర్బంధం. సహారాకు బయలుదేరాం. నిజానికి డొమెస్టిక్, అంతర్జాతీయ ఎయిర్‌పోర్టులు (DA, INA) పక్కపక్కనే ఉంటాయి. కాని రోడ్డుద్వారా మూడు కిలోమీటర్లు వెళ్లాలి. అదే నగరమాయ!

ముంబయి నగరం సిటీలైట్లను అలంకరించుకున్న సినీనటిలా ఉంది. లేటుగా నిదురపోయే నగరమిది. అలజడి తగ్గలేదు. పన్నెండింటికి సహారాలో ప్రవేశించాం. ఇదో లోకం! అల్లంత దూరందాకా అసంఖ్యాకంగా కౌంటర్లు ఉన్నాయి. వేలాదిమంది యాత్రికులు కుర్చీల్లో కునికిపాట్లు పడుతున్నారు. అన్ని దేశాలవాళ్లూ ఉన్నారు. ఇదో మినీ విశ్వం. తెల్లారుజాము నాలుగున్నరకు దుబాయికి ఫ్లైటు. ఒకటిన్నరకుగాని ఎమిరేట్స్ కౌంటర్లు తెరవరు. అంతర్జాతీయ ప్రయాణాల్లో మూడు గంటల ముందు రిపోర్టు చెయ్యాలి. అన్ని ఫార్మాలిటీస్ ఉంటాయన్నమాట! అవన్నీ ఏకరువు పెట్టను. ఎందుకంటే

ఇప్పుడవన్నీ ఎక్కువమందికి తెలిసినవే. ఓ ఇరవైయ్యేళ్ల క్రితమైతే ఇవికూడా కుతూహల రమ్యంగా ఉండేవి.

మేడం విద్యావతిగారు మాకంటే ముందే అక్కడికి చేరుకున్నారు. ఆమె, సుబ్బారావుగారు హాయిగా మాటల్లో పడ్డారు. డాక్టర్ రెడ్డి ఓ కుర్చీలో కూర్చొని హాయిగా నిద్రకు ఉపక్రమించాడు. ఆయనకది పిలవకుండానే వచ్చే అతిథిలా ఉంది. వి.సి. అయినా పుష్కలంగా నిద్రపోతున్నాడు అంటే భాగ్యశాలి అనే చెప్పాలి. ఇక నేను ఆ టర్మినల్ అంతా కలియదిరిగాను. ఎక్కడ ఏ పద్యం దొరుకుతుందో? పద్యం దొరకలేదు గాని ఎక్కడినుంచో ఓ పాట వినిపిస్తున్నది. నాకెంతో ఇష్టమైన పాట, నన్ను బాల్యం నుంచి వెంటాడే పాట. "యహ బొంబై, యహ బొంబై, యహ బొంబై. మేరి జాంమిల్తాయహ సబ్కుచ్ మిల్తానహి దిల్" ఎంత ఔచితీ సందర్భమీ పాట. ఈ పాటలో నాలుగు దశాబ్దాల కిందటి బొంబాయి ఉంది. ఈ నలభయేళ్లలో బొంబాయి ఎంతగానో మారిపోయింది. ఒకప్పుడు "పొట్ట చేతపట్టుకొని బొంబాయికెళ్లే" చేనేత కార్మికులు గుర్తుకొచ్చారు. దీని గురించి నారాయణరెడ్డిగారు మంచిపాట రాశారు.

బొంబాయి ముంబయిగా మారిపోయింది. రాజకపూర్ చూపించిన నగరం ఇప్పుడు లేదు. ఎల్.వి. ప్రసాద్ లైట్బాయ్గా అడుగిడి చిత్ర పరిశ్రమ పితామహుడిగా మారిన నగరం ఇప్పుడు లేదు. దత్తాసామంత్ సమ్మె కారణంగా వస్త్ర పరిశ్రమ సూరత్, బివండీ వగయిరా దూరాలకు వెళ్లిపోయింది. బివండీలో కూడా మరమగ్గాల మూలన పడుతున్నాయి. మన రాష్ట్రంలో సిరులగడ్డగా పేరుపొందిన సిరిసిల్లలో చేనేత కార్మికులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. 91లో ప్రారంభమైన లిబరలైజేషన్ పాలసీ నీలినీడలపార్శ్వం అనుభవంలోకి వస్తున్నది. ఒకప్పుడు మరమగ్గాలొచ్చి చేతిమగ్గాలను చంపేశాయి. అంతకంటే వేగవంతమైన సాంకేతిక పరిజ్ఞానమొచ్చి వీటినీ దెబ్బకొట్టేసింది. ఏం జరుగుతున్నదో తెలుసుకునే లోపలే పెట్టుబడిదారీ సంస్కృతి జీవితంలోకి ప్రవేశిస్తున్నది. వెనకబడిన

ప్రాంతాలకు ఈ పరిస్థితి బాధావహంగా ఉండటం సహజం. ముంబయి ఇప్పుడు ధీరుబాయి అంబానీల ప్రపంచంగా మారిపోయింది. రియల్ ఎస్టేట్ సృష్టించిన మాఫియా గ్యాంగుల ఉధృతి తగ్గి మిగిలి ఉన్నవి కొన్ని మరోమార్గంలో పయనిస్తున్నాయి. అయితే ముంబాయికి ఇండియాకు ఆర్థిక రాజధాని అనే హోదా తగ్గిందా? తగ్గలేదంటున్నారు. ఇప్పుడు ఇంజనీరింగ్ పరికరాలకు ప్రధాన కేంద్రమయ్యింది. "బొంబాయి నానీలు" పేరిట అంబల్ల జనార్ధన్ రాసిన కవితలు గుర్తుకొచ్చాయి. సహారా గురించి ఆయనిలా అన్నాడు.

> సహారా ఎయిర్‌పోర్టులో
> మంచుకాదు కురిసేది.
> డాలర్స్
> రియాల్స్

## దుబాయిలో బాయి బాయీ

విమానం ఎక్కే సమయం ఆసన్నమవుతున్నది. ముంబయి నుండి దుబాయికి ప్రయాణకాలం 3 గంటలు. కాలగమనంలో ముంబయికి దుబాయికి ఒకటిన్నర గంటల తేడా. అంటే ఉదయం 4.30కి బయలుదేరే విమానం దుబాయి 7.30కి చేరాలి. కాని మేము దుబాయి చేరేటప్పటికి ఉదయం 6 గంటలు అవుతుందన్నమాట. అయితే మూడు గంటలు ప్రయాణించలేదా? స్థానచలనం వల్ల కొద్దిగంటల తేడాతో రెండుసార్లు 6 గంటల సమయాన్ని చూశాము. If you travel towards west you gain time and if you travel towards east you will loose time అనేది సూత్రం. ఇక్కడ ఒకటిన్నర గంటలు కలిసొచ్చింది. గడియారం వెనక్కి తిరగటం అంటే ఇదే. వ్యవహారంలో గడియారం వెనక్కి తిరిగింది కాని ప్రయాణికుడి జీవితంలో 3 గంటలు ఖర్చయినట్టే. అమెరికాకు మనకు

పదిన్నర గంటల తేడా. ప్రయాణికుడు వేరువేరు చోట్ల ఒకే తేదీని చూస్తాడన్నమాట.

ఎమిరిటస్ విమానం అద్భుతంగా వుంది. అంతర్జాతీయ విమానాలన్నీ ఇలాగే ఉంటాయట. ఇది ఇంకా. తైలాధిపతుల వైభవంకదా! ముంబయి ఎయిర్‌పోర్టులో ప్రొఫెసర్ రెడ్డి మిత్రుడొకరు మా సీట్లను అప్‌గ్రేడ్ చేయించడం వల్ల కాళ్లు చాపుకోవడానికి వీలైన మంచి సీట్లే దొరికాయి. కాని హైదరాబాద్‌లో పక్కపక్క సీట్లలో కూచున్న మేము ఇక్కడ కాస్తదూరాలకు విసిరివేయబడ్డాము.

ఎదుటిసీట్ల వీపులకు అమర్చిన మినీ టి.వి.లు, ఎయిర్ హోస్టెస్‌ల అతిథి మర్యాదలు బాగున్నాయి. భోజనాలు తెచ్చిస్తున్నారు ముందుగా మా ముగ్గురికి తెచ్చిపెట్టారు. ట్రావెల్ ఏజెంటు మాకు హిందూ భోజనాలని రాయడం వల్ల పక్కా బ్రాహ్మణ భోజనాలొచ్చి ముందున్నాయి. సుబ్బారావుగారు, ప్రొఫెసర్ రెడ్డి పుట్టుకతో కాకున్నా ఆచరణరీత్యా శాఖాహారులే. నేను జాగ్రత్తకోసం శాఖాహారినయ్యాను. చుట్టూ ఉన్నవాళ్లకు నాన్ వెజిటేరియన్ వడ్డించేటప్పుడు కాస్త చలించానుగాని అది తెల్లవారుజాము కాబట్టి తినొద్దు అనుకున్నాము. నేను మాత్రం అందులో కొన్ని పరిశుభ్రమైన ఆకుల్ని మెసవి, టీ తాగి ఫ్రెషప్ అయ్యాను. ముందు ఊపిరి సలపని రోజులున్నాయి. దొరికిందల్లా తినడం మంచిదికాదు. ఎదురుగా ఉన్న పెద్ద టీ.వి.లో విమానం ఎగిరే ఎత్తునూ, దాని దిశనూ, దేశాలమధ్య దూరాలనూ, కిందవున్న సముద్రాన్ని చూపిస్తున్నారు. 3 గంటల 25 నిమిషాలు ఎలా గడిచిపోయాయో తెలియదు.

దుబాయిలో విమానం దిగుతుంటే దృశ్యాలన్నీ నయన రమ్యాలు. ఒకవైపు సముద్రం, ఆ పక్కనే ఎడారి. ఎడారిలో మొలిచిన దుబాయి నగరం. విమానం చక్రాలు రన్‌వేను తాకగానే సరిపోయిందా? దుబాయి ఎయిర్‌పోర్టే ఒక విశాలమైన ప్రపంచం. అందులోంచి బయటపడటానికి గంటకుపైగా

పట్టింది. ఈ ఎయిర్‌పోర్ట్‌ను వర్ణించడానికి నా పరిశీలన చాలదు సమయం చాలలేదు కాబట్టి. ప్రపంచంలోని అతిపెద్ద విమానాశ్రయాల్లో ఇదొకటి. అంతులేని సిమెంటు మైదానాల్లో అసంఖ్యాక విమానాలు పిట్టల్లాగ కనిపిస్తున్నాయి. విమానంలోనుంచి దిగి టర్మినల్‌లో మేము నడిచిన దూరాలు కిలోమీటర్లే. అడుగడుగునా ఎస్కలేటర్లే (కదిలే మెట్లు) కాకుండా నేలమీద ఫర్లాంగుల కొద్ది కదిలే హారిజంటల్ ఎస్కలేటర్లు కూడా ఉన్నాయి. అంతర్జాతీయ విమానాశ్రయాల్లో కాలం ఎవరికోసం ఆగదు. ఎన్నో ఫార్మాలిటీస్ గడిచిగమ్యం చేరాల్సి ఉంటుంది. ప్రతిదశలోనూ బారెడు క్యూలుంటాయి. మొత్తానికి బయటపడ్డాము.

మమ్మల్ని తీసుకెళ్ళటానికి ప్రొఫెసర్ సాగర్ వచ్చారు. ఆయన జె.యన్.టి.యు. నుండి లీవ్‌లో వెళ్లి దుబాయిలోనే అల్‌గురేర్ (Al Gurair)



విమానంలోంచి దుబాయి నగరం

అకాడమీలో పనిచేస్తున్నారు. అది డీమ్డ్ యూనివర్సిటి. ప్రొఫెసర్ రెడ్డి ఆ అకాడమిని సందర్శించవలసి ఉంది. అలాగే దుబాయ్‌లోని సాహితీ సాంస్కృతిక సంస్థ "రసమయి" తరపున లక్ష్మణరావు వచ్చాడు. అలాగే నా క్లాస్‌మేట్ కాసాల సత్యనారాయణ బావమరదులు ఆనంద్, పాండు కూడా వచ్చారు. వీరు 70 మైళ్ల దూరంలోని అబుదబీ, షార్జాలనుంచి అభిమానంతో వచ్చారు. మా రాక గురించి ప్రఖ్యాత మెజీషియన్ డా. పట్టాభిరాం, నా సన్నిహిత మిత్రుడు, మా విశ్వవిద్యాలయంలోని అంతర్జాతీయ తెలుగు కేంద్రం డైరెక్టర్ డా. టి. గౌరీశంకర్‌గార్లు రసమయికి ఫోన్ చేశారు. రసమయి తరపున దుబాయ్ తెలుగువాళ్లు మంచి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఆ మధ్య డా. అక్కినేని నాగేశ్వరరావుగారు వచ్చి వెళ్లారట. శ్రీరామ్ అధ్యక్షుడుగా నరసింహారావు కార్యదర్శిగా రసమయి రసప్రపూర్ణంగా నడుస్తున్నది. కార్లకంటే సుఖమని ఓ అందమైన బస్సుని ఏర్పాటు చేశారు. బస్సు కదిలింది ఎంత అందమైందీ దుబాయ్ నగరం! కడిగిన వెండి పళ్లెంలా తళతళలాడుతున్నది. రోడ్లేనా ఇవి. 170 కిలోమీటర్ల వాహనాల వేగం. అటు ఇస్లాం శిల్పం, ఇటు పశ్చిమదేశాల అత్యాధునిక నిర్మాణాల మణిప్రవాళ వాతావరణం. అల్‌గురేర్ అకాడమీ గెస్ట్‌హౌజ్‌ని చేరుకున్నాము. ముగ్గురు వి.సి.లకు మూడు సూట్లు.

9గం.లకు సునీల్ యాటా, డా. శంకర్ వస్తామని ఫోన్ చేశారు. సునీల్ యాటా అక్కడ ఎయిర్ ఇండియాలో పనిచేస్తున్నారు. సునీల్ ఇక్కడి నా మిత్రుడు, పారిశ్రామికవేత్త దిలీప్‌కు సన్నిహితుడు. శంకర్ పట్టాభిరాంకు బంధువు. స్నానాల కుపక్రమించాము.

బాత్‌రూంలో స్వచ్ఛమైన నీళ్లు. దుబాయ్‌లో నేలలో నీళ్లు లేవు. ఎడారికదా! సముద్రజలాన్ని శుద్ధిచేసి వాడుకుంటున్నారు. యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్(UAE) అని ఏడుదేశాలు ఒక కూటమిగా ఏర్పడ్డాయి. వాటిలో దుబాయ్ ఒకటి. మిగతావి అబూదబి, షార్జా, రసఅల్‌ఖైమా, అమ్మాద్, ఉమ్మల్ ఖైవాన్ ఫుజైరా. ఇవి 1971లో కూటమిగా ఏర్పడ్డాయి. 29

సంవత్సరాల్లోనే దుబాయ్ గుర్తుపట్టలేనంతగా అభివృద్ధి చెందాయి. ఒకప్పటి అత్యంత నిరక్షరాస్య దేశాలు అనతికాలంలోనే ప్రపంచదేశాల్తో పోటీపడుతున్నాయి.

దుబాయ్‌వాసులు ఒకప్పుడు చాలా పేదవాళ్లు. నూనెవల్ల దొరలైపోయారు. గల్ఫ్‌లోకి వచ్చే ఓడలకు ఇది ముఖద్వారం. అందుకని ఇక్కడ వ్యాపార సందడి ఎక్కువ. నూనె పడ్డప్పుడు ఇంగ్లాండువాళ్లు సాంకేతిక



*దుబాయిలోని క్రీక్ అనే ప్రదేశంలో ప్రొఫెసర్ సాగర్, ప్రొఫెసర్ వెంకటరామారెడ్డిలతో*

సహాయం అందించారు. అందుకని వాళ్లతో మంచి సంబంధాలున్నాయి. వాళ్లకి వీసా అవసరం లేదు. కిందంతా ఎడారి. ఎక్కడైనా నేలకనిపిస్తే తెలిసిపోతూనే ఉంటుంది ఎడారి ఇసుక. వర్షపాతం తక్కువైనా నీటికి కొదువలేదు. అయితే పొదుపు. దుబాయ్ నగరంలో ఎక్కడ చూసినా పచ్చదనం. మట్టిపోసి చెట్లు పెంచుతున్నారు. నీరు వృధాకాకుండా వేళ్లకు

మాత్రమే సేచనం చేస్తున్నారు. Root feeding అంటారు దీన్ని. ఇక్కడ సైన్స్‌ను నిత్యజీవిత వికాసానికి వర్తింపజేసుకుంటున్నారు. ప్రతిరంగంలో యాంత్రికాభివృద్ధిని(Automatisation) సమకూర్చుకున్నారు. 10 గంటలకు గెస్ట్‌హౌజ్‌నుంచి బయటపడ్డాము. అల్‌గురేర్ అకాడమికి వెళ్లాలి. మధ్యలో నగర సందర్శనం. ఊళ్లో ఓ సముద్రం పాయ. దాని రెండు తీరాలను కలుపుతూ జలగర్భంలోంచి ఓ రోడ్డు(Tunnel) వేశారు. దాంట్లోంచి వెళ్తున్నాం. క్రీక్ అనే ప్రదేశంలో ఆగాము. మన ట్యాంక్‌బండ్‌లాంటి అందమైన చోటు. రోడ్డు పక్కనే సముద్రం. దాంట్లో అత్యాధునికమైన బోట్లు. అల్లంతదూరాన నీటికి అంచులాగా ఆకాశహర్మ్యాలు. నీటిలో వాటి ప్రతిఫలనాలు. చూడచక్కని దృశ్యం. అందరం కెమెరాలను క్లిక్కుమనిపించాము.

అక్కడినుండి ఓ భూగర్భ మ్యూజియం (Birduboi) దగ్గర ఆగాము. అక్కడ ప్రాచీనకాలంలోని కట్టడాల మట్టిగోడలు, అప్పటి ఇండ్ల నమూనాలను భద్రపరిచారు. మళ్లీ బస్సు రోడ్డుమీద జారిపోతున్నది. డివైడర్లపైన సమున్నతమైన ఖర్జూరచెట్లు క్రమశిక్షణతో నిలబడి కన్పిస్తున్నాయి. ఒకప్పటి పేదవాళ్లు ఇప్పుడు తైలాధిపతులయ్యారు. "తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు" అన్నాడు. భర్తృహరి. ఒకప్పుడది ఊహకందని అసాధ్యం. ఇప్పుడు సాధారణమయ్యింది. ఈ ఊరు మధ్యాహ్నమే ఇంతబాగుంది రాత్రిపూట ఇంకా అందంగా వుంటుందన్నాడు ప్రొఫెసర్ సాగర్.

ఒంటిగంట ప్రాంతంలో అల్‌గురేర్ అకాడమీ చేరుకున్నాము. అన్ని హంగులున్న విద్యాలయమది. కంప్యూటర్ అప్లికేషన్స్, హోంసైన్స్‌లో ఫ్యాషన్ టెక్నాలజీ, బయాలజీ మొదలైన కోర్సులు అంతర్జాతీయ ప్రమాణాలతో నడుస్తున్నాయి. విద్యార్థులకు అత్యంత ఆధునిక సౌకర్యాలను సమకూర్చారు. క్లాస్‌రూంలో ప్రతి ఒక్కరి టేబుల్‌పైన ఒక్కో కంప్యూటర్, లైబ్రెరీ క్యూబ్‌లో కంప్యూటర్, హాస్టల్‌లో ప్రతి విద్యార్థి గదిలో కంప్యూటర్! ఇదీ సంగతి.

నాలుగు సర్వర్లున్నాయి. సర్వర్లంటే సెటిలైట్ నుంచి సమాచారాన్ని గ్రహించి పి.సి.ల కందించేవి. ఇద్దరు విసిలు మెచ్చుకున్నారు.

కాని ప్రొఫెసర్ రెడ్డి "మనకూ డబ్బులుంటే మనం ఇంతకన్న బాగా చెయ్యొచ్చు" అన్నాడు. మనకు డబ్బులెందుకు లేవు? వీళ్లు ఇండస్ట్రీలతో సంబంధాలు పెట్టుకున్నారు. వాటి అండ ఈ విద్యాలయానికి సంపూర్ణంగా ఉంది. ఇండస్ట్రీల Funding మనకెందుకు సాధ్యం కాదని అడిగాను. ప్రొఫెసర్ రెడ్డి అంటాడూ "మన దగ్గర మన పారిశ్రామికవేత్తలకు ప్రాణం ధరించదు. ఓ పట్టాన పైసా రాల్చరు. తమ ప్రయోజనాన్ని ముందు లెక్కవేస్తారు. అభివృద్ధి దృష్టికంటే లాభదృష్టి ముందు వస్తుంది. వాళ్లు చెప్పినట్టల్లా మనం ఆడలేము. మన విశ్వవిద్యాలయాలకు పరిమితులున్నాయి. ప్రభుత్వ నిబంధనలున్నాయి. యు.జి.సి. నిబంధనలున్నాయి. వాటిని గుర్తించరు."

మన దగ్గర డబ్బు లేకకాదు. స్వచ్ఛమైన సంకల్పం లేక. సంక్లిష్ట పరిస్థితుల్లోంచి మనం అభివృద్ధిని సాధించవలసివుంది. దాని అవగాహన లేక, ఉన్నా దానిపట్ల సానుభూతి లేక.

సాయంత్రం నాలుగు గంటలైంది. 5 గం.కు రసమయివాళ్లు మాకోసం తెలుగు సమావేశం ఏర్పాటుచేశారు. అకాడమీనుంచి బయల్దేరాము.

ఓ ఇనిస్టిట్యూట్‌లో సమావేశం. ముప్పై తెలుగు జంటలు మాకోసం ఎదురుచూస్తున్నారు. ఇక్కడ మేడం విద్యావతి కూడా వచ్చి కలిశారు. నలుగురు విసిలు అతిథులు. బొకేలివ్వడం వంటి సభామర్యాదలు ముగిశాక ఉపన్యాసాలు. ముందుగా అందరూ పేరుపేరునా పరిచయం చేసుకున్నారు. నేను పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం గురించీ, అది ప్రవాసాంధ్రుల కోసం చేస్తున్న భాషాసాంస్కృతిక కార్యక్రమాల పరంగా

అందిస్తున్న సహకారం గురించి మాట్లాడాను. మారిషస్, మలేసియా, దక్షిణాఫ్రికా, ఫిజీ, ఇంగ్లాండు, అమెరికా, కెనడాల్లోని తెలుగువారితో మాకుగల సంబంధాలను గురించి వివరించాను. దుబాయ్ తెలుగువారుకూడా మా సేవలను ఎలా వినియోగించుకోవాలో ఆలోచించమని చెప్పాను. "ప్రవాసాంధ్రులనే మాట నాకు నచ్చదు. రాష్ట్రం వదిలి ఎంతో పైకొచ్చి తెలుగుతేజాన్ని పరివ్యాప్తం చేస్తున్న మీరు ప్రవాసాంధ్రులెట్లా అవుతారు. మీరు పరివ్యాప్తాంధ్రులు" అన్నాను. అలాగే సుబ్బారావుగారు వ్యవసాయం గురించీ, ప్రొఫెసర్ రెడ్డి టెక్నాలజీ గురించి, మేడం విద్యావతీగారు స్త్రీ విద్య గురించీ ఆత్మీయ ప్రసంగాలు చేశారు. తేనీటి విందుతో సభ ముగిసింది. అందరూ మాతో ఫోటోలు దిగారు. మారాక దుబాయ్ తెలుగువారందరికి ఎంతో ఉల్లాసాన్ని కలిగించిందని చెప్పారు.

ఆ తర్వాత సుబ్బారావుగారూ, ప్రొ. రెడ్డి, ప్రొ. సాగర్‌తోపాటు సముద్రతీరానికి వెళ్లిపోయారు. నన్ను సునీల్ వాళ్లింటికి డిన్నర్‌కు ఆహ్వానించారు. అక్కడనుంచి 20 నిమిషాల ప్రయాణం. దూరమే కాని ఆ వేగాలముందు అలా అనిపించదు. పొద్దున ప్రొఫెసర్ సాగర్ అన్నట్టు దుబాయ్‌ని రాత్రిపూట చూడాలి. ఆ లైట్ల విన్యాసమేమిటీ! వజ్రాల నవాబ్‌సానిలా వుంది. పొద్దున అబూదాబీ నుంచి వచ్చిన ఆనంద్ వెళ్లిపోయాడు. పాండు నాతో ఉండిపోయాడు. పొద్దున వెళ్లమన్నాను.

ఆ డిన్నర్‌కు ఉదయ్‌నాయుడు, మహేశ్, గణేశ్, లక్ష్మణ్‌రావు కూడా వచ్చారు. అందరూ తమ తమ నేపథ్యాలు, పరిస్థితులను గురించి మాట్లాడారు. ఇక్కడ పైకొచ్చినవారు బాగానే ఉన్నారు కాని ఇక్కడ ఇల్లు కట్టుకోడానికి వీల్లేదు. ఎంతైనా సంపాదించుకోవచ్చు. కాబట్టి మనమెప్పటికైనా వెళ్లిపోయేవాళ్లమే అనే భావం ఇక్కడివారిలో ఉంది. ఇక్కడ భారతీయ కూలీలు హాయిగా లేరు. దయనీయంగా కూడా వున్నారు. ప్రతి శుక్రవారం నాడు 20,30 వేలమంది ఒకచోట గుమికూడి కష్టసుఖాలు కలబోసుకుంటారు. లావాదేవీలు చీటీలు, అప్పుల లాంటివి చూసుకుంటారు.

దుబాయ్ భారతీయులకు ఇండియా పక్కవూరిలాంటిది. మూడు గంటల దూరంలో బొంబాయి. ఒక్కరోజులో నేను గ్రహించిన దుబాయి ఇది.



శ్రీ సునీల్ యాటా కుటుంబ సభ్యులు

ఆత్మీయంగా సాగిన ఆ సాయంత్రం చిరకాలం గుర్తుండిపోతుంది. పాండుతో పాటు నేను గెస్టుహౌజ్‌కు చేరుకున్నాను. పొద్దున్నే నాలుగున్నరకి లేవాలి.

## సైప్రస్ తీరాల్లోకి....

నాలుగున్నరకు లేచి ఆరింటికి అంతర్జాతీయ విమానాశ్రయానికి బయల్దేరాము. దుబాయ్ నగరం ఉదయం మంచుదుప్పటికింద మగతగా

వుంది. సైప్రస్‌కు 8.20గంటలకు ఫ్లైటు. 6.20కి చేరుకున్నాము. ఫార్మాలిటీస్‌కు 2 గంటలే సమయముంది. కౌంటర్ల ముందు పొడవైన క్యూలున్నాయి. తొందరగా కదలవు. పైగా ఇది దుబాయ్ విమానాశ్రయం. అంతులేని దూరాలు. ముందే చెప్పాను. వెర్టికల్ ఎలివేటర్లతోపాటు నేలమీద మెల్లగా పాకుతూపోయే హారిజాంటల్ ఎస్కిలేటర్లు కూడా ఉంటాయి. వీటిమీద నడుస్తుంటే వాటి చలనం వల్ల కొంత నడకా, సమయం కలిసొస్తాయి. మొత్తంమీద చివరి నిమిషాలకు కొంతముందుగా విమానంలో ప్రవేశించగలిగాము. స్థిమితపడి ఉడాన్‌కోసం ఎదురుచూస్తున్నాము. ఆలస్యమయ్యేట్టుంది. అవును 9.15 గం.కు 55 నిమిషాలు ఆలస్యంగా విమానం లేచింది.

సంభాషణ విమానాల్లోని సాంకేతికాంశాలవైపు మళ్లింది. ఒకప్పుడు విమానగమనం ఎక్కువగా పైలట్ సామర్థ్యంపైన ఆధారపడి ఉండేది. ఇప్పుడంతా కంప్యూటర్ చేసిపెడ్తుంది. విమానం పైకి లేవటంలో నాలుగు దశలుంటాయి. 1. రన్‌వేమీద పరిగెత్తడం(Taxing) 2.పైకి లేవటం(Take-off) 3. పైన సద్దుకోవడం(Airborn) 4. స్థిరంగా సాగటం(flight). లేచేటప్పటిలాగే నేలమీద దింపేటప్పుడు కూడా రెండు దశలుంటాయి. 1. వేగం, ఎత్తు క్రమంగా తగ్గడం 2. నేలమీద దిగడం(landing). నేలమీద దింపటంలోనే పైలట్ సామర్థ్యం ఉంటుంది. ఆటోమేటిక్ లాండింగే అయినప్పటికీ గేర్ ఎప్పుడు వెయ్యాలనేది పైలట్ జడ్జిమెంటుపైన ఆధారపడి వుంటుంది.

ఇలా మాట్లాడుకుంటుండగానే బ్రేక్‌ఫాస్ట్ వచ్చింది. మాకు అదే హిందూ ఫలహారం. తిని కాఫీ తాగేటప్పటికి అలసట తగ్గినట్టనిపించింది. గల్ఫ్‌టైమ్స్ పత్రికను తీసుకొని చదవడం ప్రారంభించాను. నిద్ర రెప్పల్ని పట్టుకొని కిందికి లాగుతున్నట్టుగా కళ్లు బరువెక్కాయి. కాస్త కునుకు తీసినట్టున్నాను.

విమానం కదలికలో గమ్యాన్ని సమీపిస్తున్న తెలివిడి. కిటికీలోంచి కింద అనంతంగా పరుచుకున్న మధ్యధరా సముద్రం కనిపిస్తున్నది. విమానం చేప ఆకారంలా కనిపించే ఓ భూభాగాన్ని సమీపించి విన్యాసాలు చేస్తున్నది.



మధ్యధరా సముద్రం సాయం సంధ్యలో వీనస్ రాక్

సరిగ్గా 12.33 గం.లకు సైప్రస్‌లోని లార్నాకా విమానాశ్రయంలో దిగింది. లార్నాకా(Larnaka) సైప్రస్‌లోని తీరపట్టణాల్లో ఒకటి. మిగతా రెండు నగరాలు లిమసోలా, నికోషియా. నికోషియా రాజధాని పట్టణం.లార్నాకను లానక అని పలుకుతున్నారు. "ర" పలకదు. లార్నాకా హైదరాబాద్‌లోని మన తార్నాకాలాగా ధ్వనించింది. సైప్రస్ టైమ్ దుబాయ్‌కంటే ఓ గంటముందు. బొంబాయికంటే రెండున్నర గంటలు ముందు. లార్నాకలో దిగినప్పుడు హాయిగా దక్షిణవాయువులు వీస్తున్నాయి. అప్పుడు టెంపరేచర్ 21 డిగ్రీలు.

సైప్రస్ ఎయిర్‌పోర్టు చిన్నది. దుబాయ్‌ను చూసిన కళ్లకి చిన్నది.

సైప్రస్‌కి వీసాలేదు మాకు. ఢిల్లీలో సైప్రస్ ఎంబెస్సీ మూసివుంది. కాబట్టి ఇక్కడే ఇస్తారని చెప్పారు. ఇక్కడ ఎట్లాంటి అనుభవాలు ఎదురౌతాయో అని అనుకుంటున్నాము. ఇంతలో ఒకాయన వచ్చి సుబ్బారావుగారి గురించి అడుగుతున్నాడు. ఆయనపేరూ సుబ్బారావే. వి.వి.యస్. సుబ్బారావు. సైప్రస్‌లోని ఇండియన్ ఎంబెస్సీలో First Secretary . తెలుగువాడు. హమ్మయ్య ప్రాణం లేచొచ్చింది. ఆయన మా పాస్‌పోర్టులూ కాగితాలు తీసుకొని లోపలికి వెళ్లి పది నిమిషాల్లో బయటికొచ్చాడు. వీసాలొచ్చేశాయి. ఇంతలో సైప్రస్ యూనివర్సిటీ తరఫున ఒకామె వచ్చి మా పేర్లు అడిగి తన చేతిలోని లిస్టులో టిక్ చేసుకుంది. మమ్మల్ని తీసుకెళ్లడానికి వ్యవస్థవుంది గాని సుబ్బారావుగారు వారింటికి లంచ్‌కోసం తీసికెళ్లడానికి ఏర్పాటుచేశారు.

## సైప్రస్‌లో తెలుగుతల్లి

ఇద్దరు సుబ్బారావులూ నేనూ ఒక కార్లో, ప్రొ. రెడ్డి మేడం విద్యావతీ మరో కార్లో లిమసోలా నగరానికి బయల్దేరాం. ఈ నగరం మధ్యధరా తీరప్రాంతం. సుబ్బారావుగారి ఇల్లక్కడే. విశాలమైన హైవే. కార్లు 170 కి.మీ. వేగంతో వెళ్తున్నాయి. లానకకు లిమసోలా 70 కి.మీ. దూరంలో వుంది. రోడ్లమీద జనసంచారం లేదు. అక్కడక్కడ కెమెరాల్లోంచి పోలీసులు కార్ల వేగాన్ని పరిశీలిస్తున్నారు. నిబంధనలు మీరితే పట్టుకుంటారు. చుట్టుపక్కల ఎక్కడా పచ్చదనం లేదు. ద్వీపమంతా సున్నపురాయినేల అని వి.సి. సుబ్బారావుగారు చెప్తున్నారు. లిమసోలా సమీపించేకొద్దీ పచ్చదనం పెరుగుతున్నది. చెట్లే, వృక్షాలు కనిపించవు. లిమసోలాలో 300 మంది భారతీయులున్నారట. కొత్త కోర్సులు చదవడానికి విద్యార్థులు ఈ ద్వీపాన్ని ఎన్నుకుంటున్నారు. పెద్ద ఫీజులతో వస్తారు. అంత పెద్ద ఫీజులు తట్టుకోడానికి ఇక్కడ చిన్న చిన్న పనులు చేస్తారు. సైప్రస్ కీలకమైన ప్రదేశంలో వుంది. యూరోపియన్ దేశాలతో సజీవ తక్షణ సంబంధాలున్నాయి.



సైప్రస్‌లో తెలుగుతల్లి శ్రీమతి శారదాసుబ్బారావు

ఇంగ్లాండు, అమెరికాలాంటి దేశాలకు వెళ్లొచ్చనే ఆశతో వస్తారు. లిమసోలాలోని 300 మంది భారతీయుల్లో 70 మంది తెలుగు వాళ్లున్నారు. ఇవన్నీ మాట్లాడుతుండగానే సుబ్బారావుగారిల్లు చేరాము. ఇంటి ముందు దిగగానే ముగ్గులు కనిపించాయి. మొక్కలకు తెలుగుపూలు (బంతీ, చేమంతి) విరబూశాయి. మళ్లీ మనింటికొచ్చినట్టుంది. తప్పకుండా ఇక్కడో తెలుగుతల్లి ఉంది. మేడమీంచి ఒకావిడ "రండి రండి" అని ఆహ్వానించింది. తప్పకుండా ఆమె సుబ్బారావుగారి ధర్మపత్ని అయివుంటుంది. పైకెక్కి "మీరేకదా! సైప్రస్‌లో తెలుగుతల్లి" అన్నాను. ఆమె హాయిగా గలగలా నవ్వేశారు. పెద్ద ఇల్లు. అందరం సోఫాల్లో కూలపడ్డాం. ఎంబెస్సీ పద్ధతిలో మర్యాదలు. రాఘవులుగారు, డి.సి. రెడ్డిగార్లతో వారికింకా కాంటాక్టు దొరకలేదు. రాఘవులుగారు నికోషియాలో ఉండి ఉంటారు. ప్రొఫెసర్ డి.సి.

రెడ్డి శ్రీమతితోపాటు వచ్చారని తెలుసు. ఎక్కడున్నారో! మేమొస్తున్నామని తెలిసి తెలుగు జంటల్ని ఆహ్వానించారు. ఒక్కొక్కరే చేరుకుంటున్నారు.

ఆమె తెలుగు భోజనం వడ్డించారు. ప్రయాణంలో పేరు తెలియని, నాలుక చెప్పుకోలేని పదార్థాల్ని తిన్న మాకు తెలుగు వంటల పరిమళం ఘుమఘుమలాడుతున్నది. సుబ్బారావుగారే స్వయంగా వడ్డన చూస్తున్నారు. ఆయన నిరాడంబరంగా సాదాసీదాగా ఉన్నారు. ఆకృతిలో, మాటతీరులో శీలావీర్రాజుగారిని తలపించారు. ఆయన తూర్పుగోదావరి జిల్లావాడు. ఆమె



సైప్రస్‌లోని ఇండియన్ హైకమీషన్‌లో ఫస్ట్ సెక్రటరీగా ఉన్న
శ్రీ వి.వి.ఎస్. సుబ్బారావు, వారి సతీమణి శ్రీమతి శారద

పశ్చిమగోదావరి జిల్లా. ఆ మాత్రం భేదమే వారిమధ్య బోలెడన్ని ఛలోక్తులకు కారణమయ్యింది. ఆమె గలగల గోదారి. బోళామనిషి అనిపించింది. ఎన్నో

దేశాల్లో పనిచెయ్యడంవల్ల ఎన్నో అనుభవాల ఊసులు. మేం లిమసోలా వెళ్లాలి. కాన్ఫరెన్స్ అక్కడే. మరో 70 కిలోమీటర్లు. నాకు లోపల తొందరగా వుంది. చీకటి పడే లోపలే వెళ్లి ఫార్మాలిటీస్ అన్నీ పూర్తిచేసుకొని ఆ వాతావరణానికి అలవాటవ్వాలి. రేపటి కాన్ఫరెన్స్‌కి సంసిద్ధంగా ఉండాలి. ఇదీ నా ఆరాటం.

మరుసటి రోజు అంటే 22వ తేదీ సాయంత్రం 5 గంటలకు కాన్ఫరెన్స్ ప్రారంభం. అంటే సాయంత్రం దాకా మేము ఫ్రీగా ఉంటాము. అందుకని సుబ్బారావు దంపతులు మాకు సైట్ సీయింగ్ ఏర్పాటు చేస్తామన్నారు. కార్లు నికోషియా నుండి లిమసోలా నగరం వైపు బయల్దేరాయి. లంచ్‌కు వచ్చిన యువకిశోరాలే మమ్మల్ని తీసుకెళ్తున్నారు. ఎ.సి.కార్లు, మధ్యధరా సముద్ర సమీరాల స్పర్శకోసం గ్లాసు కాస్త తెరిచాను. మెత్తటి గాలి. అట్లాంటిక్ సముద్రంలాగా కాకుండా మధ్యధరా సముద్రం ప్రశాంతమైంది. ఉత్తుంగ తరంగాలుండవు. ఉధృత విజృంభణాలుండవు. ఈ సముద్రంలో రెండు ద్వీపాలు. సైప్రస్, మాల్టా. సైప్రస్ పెద్దది. సైప్రస్ టర్కీకి సమీపంగా ఉంటే, మాల్టా స్పెయిన్‌కి దగ్గరలో ఉంది.

దారిలో అక్కడక్కడ ఒకటి రెండు పల్లెటూళ్ళు కనిపిస్తున్నాయి. పల్లెటూళ్ళంటే మనలాంటి పల్లెలుండవు. పట్నాలు కావని అర్థం. గోధుమ జాతికి చెందిన Vat1[ పంట కోతలకు సిద్ధంగా వుంది. కొన్నిచోట్ల కోతలైపోయాయి కూడా. అలాంటిచోట్ల గడ్డిని బండిల్స్‌గా చుట్టిపెట్టారు. వాటిని దొర్లించవచ్చు. పత్రికాఫీసుల్లో న్యూస్‌ప్రింట్ బండిల్స్ ఆకారంలో ఉన్నాయి. మనలాగా వాములు లేవన్నమాట. ఒక పల్లెటూరిని పరిశీలించాలని ప్రొ. రెడ్డి ఆరాటం. ఈ రెజిమెంటేషన్‌లో ఆయన కోరిక తీరుతుందో లేదో చూడాలి. దూరంగా నీలినీలి జలాల్తో మధ్యధరాతీరం కనిపిస్తున్నది. దాని ఒడ్డున నిలబడి చిరునవ్వులు చిందిస్తూ ఆహ్వానించే గ్రీకు సుందరిలా లీ మెరీడియన్ హోటల్. పెద్ద ఆవరణ. హోటల్ ముందు కార్లు ఆగాయి. నాకింకో మాట తోచదు...అదో ప్రపంచం!

# లీ మెరీడియన్ హోటల్

రిసెప్షన్‌లో సైప్రస్ యూనివర్సిటీ వాళ్ల ప్రత్యేక కౌంటర్ వుంది. మేము చేరినట్టు టిక్ చేసుకొని, మా రూంనెంబర్లు చెప్పి, మాకు కాన్ఫరెన్స్



*లీ మెరీడియన్ హోటల్ ప్రాంగణంలో*

మెటీరియల్ ఇచ్చారు. నాకూ, ప్రొ. రెడ్డికీ, మేడమ్ విద్యావతికీ ఈ హోటల్లో ఏర్పాటు చేశారు. సుబ్బారావుగారి పేరు దాపునేవున్న సెంట్ రాఫెల్ హోటల్ లిస్ట్‌లో ఉంది. మా ఉత్సాహంమీద నీళ్లు చల్లినట్లు అనిపించింది. వారిని కూడా ఈ హోటల్లోకే మార్చాలని కోరాం. వారు చల్లని చిరునవ్వులతోనే వీలు కాదన్నారు.

సుబ్బారావుగారిని సెంట్ రాఫెల్‌కి పంపించి మేము మామా

రూములకు వెళ్లాము. రూములను తెరవటానికి చిన్న కంప్యూటరైజ్‌డ్ కార్డు ఇచ్చారు. దానిని తలుపుకమర్చివున్న సందులో ఇన్సర్ట్ చేస్తే తెరుచుకుంటుంది. ముందు గబగబా కిటికీ తెరలు తొలగించి వెనక బాల్కనీలోకెళ్లి చూశాను. హమ్మయ్య! సముద్ర దృశ్యం. ప్రొ. రెడ్డి రూము ఇలా కాకుండా మధ్యలో వచ్చింది. ఆయనకెందుకులే, సముద్రాన్ని చూస్తూ కూడా టెక్నాలజీ గురించి మాట్లాడతాడు. రూమంతా ఆటోమేటైజేషన్. దేన్ని ఎలా ఉపయోగించాలోతెలియటానికి ఒకరోజు పట్టింది. ముందు బాత్‌రూంలో ఉన్న సౌకర్యాలను అర్థం చేసుకోడానికి బోలెడంత అనుభవం ఖర్చయ్యింది. ఎక్కడికి వెళ్లినా మినరల్ వాటర్ బాటిల్స్ కొనడం నాకలవాటు. ఈ హోటల్లో రెండు స్ప్రైస్ పౌండ్లకొక బాటిల్ మన నూట నలభై రూపాయలన్నమాట. ఇట్లా కాదని శర్మగారి సహాయంతో అందరం ఒక సూపర్‌బజార్‌కెళ్లి వాటర్‌బాటిల్స్ కొన్ని, చిరు ఆహారాలు కొనుక్కొచ్చు కున్నాము. అక్కడ రెండు పౌండ్లకే ఐదు బాటిల్స్. నాదేమో రూపాయల సైకాలజి. పాశ్చాత్యదేశాలకెళ్లిన ఎవరికైనా అదే అనుకుంటాను. కాన్ఫరెన్స్‌వాళ్లు జేబు ఖర్చుగా 50 పౌండ్లు ఇచ్చారు. వాటిలోనే సద్దుకోవాలని నా పట్టుదల. ఆ రాత్రి నాగార్జున వి.సి. సి.వి. రాఘవులుగారి రూంనంబరు కనుక్కున్నాను. ఆయన అంతకుముందు రోజే వచ్చి ఉన్నారు. ఆయనే రిసెప్షన్ ఆవరణలో తటస్థించారు. వాతావరణం అంతా భారతీయంగా మారిపోయింది. రాఘవులుగారు మంచి సంభాషణాశీలి. స్నేహమాధుర్యా లను వెదజల్లేవారు. ఆ రాత్రి నిద్రకుపక్రమించే ముందు టి.వి.లో గ్రీకు పాటలు విన్నాను. భాష తప్ప అచ్చం మన తెలుగు భావగీతాల్లా ఉన్నాయి. వినసొంపుగా ఉన్నాయి. ఇటాలియన్ అజంత భాష. మన తెలుగుకూడా. అందుకే తెలుగును "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అన్నారు.

స్నానాదులు ముగించుకొని లిఫ్ట్‌లో కింది అంతస్తులోకి వచ్చాము. మూడు లిఫ్ట్‌లు ఉన్నాయి. అన్నీ ఆటోమేటిక్ లిఫ్ట్‌లే. లాంజ్‌లో మేడం విద్యావతి కూర్చొని ఉన్నారు. ఆమె రెస్టారెంట్‌లో బ్రేక్‌ఫాస్ట్ చేసివచ్చి పిచ్చాపాటి మాట్లాడుతున్నారు. అదేమిటమ్మా? అంటే తనకు ఐదున్నరకే లేవటం అలవాటు అని చెప్పారు. ఇంతలో ప్రొ. రెడ్డి, ప్రొ. రాఘవులుగారు

వచ్చి కలిశారు. విశాలమైన రెస్టారెంట్. ప్రపంచంలోని అన్ని రకాల పదార్థాలు ఉన్నాయి. మేము బ్రెడ్ ముక్కలు, ఆమ్లెటు, ఓ యాపిల్ పండు తెచ్చుకొని ఓ టేబిల్ చూసుకుని కూర్చున్నాము. రాఘవులుగారు అంతర్జాతీయ పదార్థాల వేటలో పడ్డారు. టేబుల్ మీద ప్రతివారి ముందు ఒక్కో కాగితం షీటు పరిచి ఉన్నాయి. వాటిమీద నిత్యవ్యవహారంలో వాడవలసిన మాటలు వివిధ భాషల్లో ఉన్నాయి. ఫ్రెంచ్, జర్మన్, గ్రీక్ మొదలైన భాషల్లో ఉన్నాయి. మాకు ఇంగ్లీషు ఎలాగూ ఉండనే ఉంది. ఎంత తన్నుకున్నా గ్రీకు ఇంత హటాత్తుగా అర్థమయ్యే భాషకాదు. అందుకనే మనవైపు ఎవరైనా అర్థంకాకుండా మాట్లాడితే "గ్రీకు లాటిన్‌లా ఉంది" అంటాం. మా టేబిల్‌కు కుడిపక్కన అద్దాల తలుపులకానుకొని నీలిజలాలతో స్విమ్మింగ్‌పూల్ ఉంది. అడుగు కనిపించేంత స్వచ్ఛమైన నీరు. ఇక్కడ ఎవరూ ఎవరిని పట్టించుకోరు. వింతగా చూడరు. ఎవరి పని వారిదే.



లీ మెరీడియన్ లాంజ్‌లో కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ శ్రీమతి సరస్వతీరావు, ఇతర వి.సి.లతో....

బ్రేక్‌ఫాస్ట్ ముగించి లాంజ్‌లోకి వచ్చాము. నిన్న హడావుడిగా కనబడ్డ వి.సి.లు ఇప్పుడు కొంత స్థిమితంగా కనపడ్డారు. సరిగ్గా 9 గంటలకు సుబ్బారావు దంపతులు, శ్రీకాంత్, శర్మ, సునిల్ తదితర యువకిశోరాలు మూడుకార్లలో వచ్చారు. సుబ్బారావు దంపతులన్నానా, నిజానికి శ్రీమతి శారదా దంపతులనాలి. శారదగారు అంటే ఆమె ఒప్పుకోరు. శారదా సుబ్బారావు అని తీరాలి. పొరపాటున అన్నామంటే మధ్యధరా సముద్రం తన ప్రశాంతతను కోల్పోతుంది. ఓ కారు వెళ్లి సెంట్‌రాఫెల్‌లో ఉన్న ప్రొఫెసర్ డి.సి. రెడ్డి దంపతుల్ని, ఐ.వి. సుబ్బారావుగారిని తీసుకొచ్చింది. సైప్రస్‌లో దర్శనీయ స్థలాలు రెండు దిశల్లో ఉన్నాయి. ట్రూడోస్ పర్వతపంక్తులు ఒకవైపు, ప్రాచీన గ్రీకు చారిత్రక కట్టడాలు మరోవైపు. సదస్సు నిర్వాహకులు 26వ తేదీన అధికారికంగా ఈ రెండింటిలో ఒకవైపుది చూపించబోతున్నారు. కాబట్టి ప్రైవేటుగా మాకు దొరికిన ఈ మహదావకాశాన్ని గ్రీకు కట్టడాలవైపు మళ్లించాము.

## సైప్రస్‌లో చారిత్రక ప్రదేశాలు

ముచ్చటగా మూడుకార్లు బయలుదేరాయి ముచ్చట్లతో. నేనెక్కిన కారులో హైకమీషన్ ఫస్ట్ సెక్రటరీ సుబ్బారావుగారు, ఐ.వి. సుబ్బారావుగారు ఉన్నారు. ఇంకేం కావాలి? ఒకరు అధికార నిధి. మరొకరు అనుభవనిధి. సుదీర్ఘమైన బీచ్ రోడ్డులో వెళ్తున్నాము. అది హైవే. పాఫోస్ ప్రాంతానికి వెళ్లే రోడ్డు. పాఫోస్ దేవతల క్రీడాస్థలిగా పేరుగాంచిన ప్రాంతం. ఎంత చూసినా తనివితీరని తీరప్రాంతం. పాఫోస్‌లో రెండవ అంతర్జాతీయ విమానాశ్రయం ఉంది. నేను సైప్రస్‌గురించి అడుగుతున్న ప్రశ్నలకు సుబ్బారావుగారు ఓపిగ్గా సమాధానాలు చెపుతున్నారు.

సైప్రస్ 9251 చదరపు కిలోమీటర్ల వైశాల్యంతోవున్న ద్వీపం.

పేరుకు చిన్న ద్వీపమే. కాని ప్రపంచాన్నంతా కడుపులో పెట్టుకునేంత పెద్ద హృదయం. ఇది మధ్యధరా సముద్రంలో ఉత్తర ఈజిప్టుకి 384 కి.మీ.



గ్రీకు చారిత్రక శిథిలాల్లో వి.సిలు ప్రొఫెసర్ సుబ్బారావు, ప్రొఫెసర్ వెంకటరామారెడ్డి, ప్రొఫెసర్ శ్రీమతి విద్యావతిగార్లతో..

దూరంలో సిరియా పశ్చిమ ప్రాంతానికి 102 కి.మీ. దూరంలో గ్రీసు తూర్పు ప్రాంతానికి 800 కి.మీ. దూరంలో ఉర్కీ దక్షిణ ప్రాంతానికి 70 కి.మీ. దూరంలో ఉంది. ఈ 70 కి.మీ. దూరమే సైప్రస్ కొంప ముంచింది. 27 ఏళ్ళ క్రితం 1974లో టర్కీ సైప్రస్‌పై దాడిచేసి దాదాపు మూడింట ఒకవంతు భాగాన్ని ఆక్రమించి పారేసింది.

ఇదెలా జరిగిందంటే ప్రధానంగా సైప్రస్ గ్రీకు ద్వీపం. 80 శాతం గ్రీకులు 20 శాతం టర్కీయులు ఉన్నారు. వీరికి గ్రీస్, టర్కీ దేశాలతో బావసంబంధం ఉండటం సహజం. గ్రీస్‌కు సైప్రస్‌ను తనలో కలుపుకోవాలని

చిరకాల దాహం. టర్కీలకది తెలుసు. గ్రీస్ అర్ధగంట దూరంలో ఉంటే, టర్కీ పది నిమిషాల దూరంలో ఉంది. గ్రీకు సైన్యాలు అక్కడ లేచీలేవకముందే టర్కీ దీన్ని మూడింట ఒక వంతు భాగాన్ని ఆక్రమించుకుంది. టర్కీయులంతా ఆక్రమిత సైప్రస్‌లోకి తరలిపోయారు. సైప్రస్ జనాభాలో ఆరు లక్షల 60 వేల మంది గ్రీకులైతే లక్షా యాభై వేలు టర్కీయులు. ఈ ఆక్రమణతో గ్రీకు సెంటిమెంటు విపరీతంగా దెబ్బ తిన్నది. వారి ప్రతి ప్రవర్తనలో సందర్భం వచ్చినప్పుడల్లా ఈ బాధను వ్యక్తం చేస్తూనే వుంటారు. సైప్రస్ గ్రీకులు సంప్రదాయ ప్రియులు. సంస్కృతీ ప్రియులు. సహజంగానే భోగలాలసులు, శాంతి కాముకులు అయిన గ్రీకులకు ఈ ఉపద్రవం ఎందుకేర్పడింది? అక్కడి మైనార్టీ టర్కీయుల్లో గ్రీకులు తమను సరిగ్గా చూడటంలేదనే భావం చిరకాలంగా నెలకొనివుంది. అధిక సంఖ్యాకులు అల్పసంఖ్యాకులపట్ల చూపించే వివక్షను వారనుభవించి వుంటారు.

విడగొట్టబడ్డ రెండు భాగాల మధ్య గోడను కట్టేశారు. ప్రపంచదేశాలన్నీ టర్కీ ఆక్రమణను నిర్ద్వంద్వంగా ఖండించాయి. ఆక్రమిత సైప్రస్‌ను ఒక టర్కీ మాత్రమే గుర్తించింది. సైప్రస్ సమస్య ఒక రావణకాష్ఠంలా తయారయ్యింది. ఇది శ్రీలంక సంక్షోభంలాగ నిత్యం రగులుతూనే వుంటుంది. టర్కీ ఆక్రమణ సమయంలో గ్రీకులు ప్రతిఘటించలేదా? సైన్యంలేదా? అంటే లేదు. నేషనల్ గార్డ్స్ అని ఓ అలంకారప్రాయమైన రక్షకదళాలున్నాయి. టర్కీ ఆయుధాలముందు గ్రీకుల సాంప్రదాయక బృందగానాలేపాటి? అక్కడా ఇక్కడా కాందిశీకుల సమస్య తలెత్తింది.

హైవేకి మళ్లేముందు ఓ కుటుంబాన్ని పికప్ చేసుకోవల్సి వచ్చింది. ఒక కాలనీలో ఆగాము. మనలాంటి భవంతులే. కాని బహుళ అంతస్థులుండవు. ప్రొ. రెడ్డి అక్కడ చిన్న మైదానాల్లో ఆడుకుంటున్న పిల్లలతో మాటలు కలిపాడు. వారికి ఇంగ్లీషు కొంచెమే వచ్చు. మన ఉచ్చారణ

తొందరగా ఎక్కదు. ఇక్కడ పిల్లులెక్కువ. కుక్కలు చాలా తక్కువ. అవికూడా ఇంట్లో పెంచుకునే కుక్కలు. పిల్లులు వూరపిల్లులు. ఇవి కుక్కలను కూడా తరుముతుంటాయి. ఈజిప్టులోకూడ పిల్లులెక్కువట. అంతేకాదు. మధ్యధరా సముద్ర దేశాలన్నిటిలో పిల్లుల ప్రాబల్యం వుండటం ప్రత్యేక గమనార్హమైన విషయం. సైప్రస్‌లో పిచ్చుకలున్నాయి. కాకులు కనబడతాయి. ఇతర పక్షులు తక్కువట. అవికూడా వలసలో భాగంగా కొన్నాళ్ళుండిపోయే అతిథులు.

మా కారు సునీల్ డ్రైవ్ చేస్తున్నాడు. సుఖంగా నడిపిస్తున్నాడు. హైవే నుంచి గ్రామసీమలనుంచి వెళుతున్నాయి కార్లు. ఎత్తయిన Silver Oak చెట్లు కనిపిస్తున్నాయి. ఇవి మన హిమాలయాల్లో కూడ వున్నాయి. ఆరెంజ్ గ్రూప్‌కు చెందిన పండ్లు సైప్రస్‌లో ఎక్కువ. పువ్వులన్నీ మన పువ్వులే. నిజానికి పువ్వులొక్కరి సొత్తా! ఎక్కడ చూసినా మందారాలే. ముద్దమందారాలు కాదు రెక్కమందారాలు. గన్నేరు పూలున్నాయి, చేమంతులున్నాయి. పెద్ద పెద్ద గులాబీలున్నాయి. ఆలివ్ చెట్లను దాటిపోతున్నాము. ద్రాక్షతోటలు మొదలయ్యాయి. ఇక్కడ ద్రాక్ష పంట ఎక్కువ. పోయిన సంవత్సరం ఎక్కువగా పండి అంతర్జాతీయ మార్కెట్‌లో ధర పలకకపోవటంవల్ల ఆరువేల టన్నుల ద్రాక్షలను సముద్రంలో పారవేశారట. మధ్యధరా వాతావరణం ఆహ్లాదకరమైనదే కాదు, ఆరోగ్యకరమైనది కూడా. వివిధ దేశాలనుంచి టూరిస్టులు ఇక్కడికి రావడానికి అదో ప్రధాన కారణం.

సాలమిస్(Salamis) చేరుకున్నాము. ఇది సైప్రస్‌లో అతిప్రాచీనమైన క్రైస్తవ నగరం. పురావస్తు సంపదకు నెలవు. ఇక్కడ రోమన్ యాంఫీ థియేటర్ కట్టడం విశేషమైంది. చుట్టూ మెట్ల గ్యాలరీ కింద విశాలమైన వేదిక. ఇక్కడ గ్రీకు నాటకాలు, బుల్‌ఫైట్స్ జరిగేవి. సముద్రం నేపథ్యంగా ఉన్న ఈ కట్టడం ఉత్సుకతను కలిగిస్తుంది.

ఆ మెట్లపై కూచొని ఫోటోలు దిగాం. ప్రొఫెసర్ డి.సి. రెడ్డి వారి శ్రీమతితో వచ్చారు. యూనివర్సిటీ టెన్షన్స్ లేకుండా హాయిగా నవ్వుతూ కలిసిపోయారు. ఉస్మానియాలో తెలుగు మాధ్యమం గురించి మా యిద్దరికీ



యాంఫీ థియేటర్ మెట్ల గ్యాలరీ

భిన్నాభిప్రాయాలున్నాయి. ఇద్దరం ఒకరి వాదాన్ని మరొకరం విని Convince చెయ్యడానికి ప్రయత్నించేవాళ్లం. రెడ్డిలో ఎక్కడా వాక్పారుష్యం ఉండదు. Highly refined person ప్రొ. వెంకట్రాంరెడ్డి తన పల్లీయ పరిమళాన్ని కాపాడుకున్నాడు. పసిపిల్లవాడిలా ప్రతిస్పందించడం ఆయన ప్రత్యేకత.

రోమన్ భవనాల శిథిలాలు అలనాటి వైభవాన్ని తలపిస్తున్నాయి.



గ్రీకు శిథిలాల దగ్గర ప్రొఫెసర్ డి.సి. రెడ్డి దంపతులు, ఇతర వీసీలు

ఇద్దరు జర్మన్ వనితలు మమ్మల్ని సమీపించి "మీరు ఇండియన్లు కదూ" అని పలకరించారు. "నాకు కలకత్తా తెలుసు" అంది ఒకామె. నేను మాక్సుముల్లర్, గెథే గురించి మాట్లాడబోయాను. నా పిచ్చినాది. వారికి సాహిత్యం గురించి తెలుసని అనుకుంటే ఎలా! ఇంతలో శారదాసుబ్బారావుగారు మమ్మల్ని సమీపించి "వాళ్లు జర్మన్లు. జర్మన్లంటే నాకు నచ్చదు. ఎందుకో తెలుసా! జర్మన్లు పిల్లలు ఏడిస్తే ఊరుకోబెట్టరు. అలమార్లో పెట్టి తలుపులు వేసి శిక్షిస్తారు" అంది "జయహో సైప్రస్‌లో తెలుగు తల్లి" అంటూ నవ్వేశాం.

అక్కడ్నుంచి సూర్యదేవాలయానికి వెళ్లాం. సూర్యుడు గ్రీకులకు



ఇద్దరు జర్మన్ వనితలతో...

ముఖ్యదైవం. Appolo అంటారాయన్ని. మన కోణార్క గుర్తుకొచ్చింది. దానిలాగే ఇదికూడా సూర్యస్థానం(Sun point) గ్రీకు గాథల్లో సూర్యుడి గురించి బోలెడన్ని ఐతిహ్యాలున్నాయి. సూర్యుడు ఎవరికి మాత్రం దేవుడుకాదు. "ఓ సూర్యనారాయణా" అంటూ భానుమతి గొంతు స్ఫురించింది. మనం ముందు లేచి తర్వాత సూర్యున్ని మేల్కొల్పే సంస్కృతి మనది.

కురియన్ వచ్చేముందు ఫమగుప్త(Famagupta) అనే శిథిలనగరం ఉంది. ఒకప్పుడు ప్రపంచంలోని సంపన్న నగరాల్లో ఒకటి. షేక్స్పియర్ ఒథెల్లో నాటకానికి సెట్టింగ్ ఇది.

# వీనస్‌రాక్

అక్కడినుంచి మళ్లీ కార్లు కదిలాయి. మేము అద్భుతమైన ప్రదేశంలోకి వెళ్లబోతున్నామన్నారు. ఎత్తయిన రోడ్డుమీద వెళ్తున్నాము. ఎడమవైపు దిగువన సముద్రం కనిపిస్తున్నది. అలా రెండు కిలోమీటర్లు వెళ్లి



*వీనస్ రాక్ దగ్గర*

ఎడమవైపు బీచీలోకి దిగాము. ఆ బీచీలో ఇసుక కాదు వుంది, నునుపెక్కిన చిన్నచిన్న రాళ్లు. సాలగ్రామాలన్న మాట. సాలగ్రామాలు నదీతీరాల్లో వుంటాయిగాని సముద్రతీరంలో చూడటం నాకిదే మొదటి అనుభవం. నా చిన్నప్పుడు నాగార్జునసాగర్‌లో ఇవి విరివిగా దొరికేవి. అందమైన రాళ్లను ఏరి జేబులనిండా నింపుకొని, ఇంటికి తెచ్చుకొని పేపర్ వెయిట్లుగా

వాడుకునేవాళ్ళం. నేనూ ఓ రెండు రాళ్లను వెతికి జేబులో వేసుకున్నాను. ఇవి రాళ్లే. కాని ఇక్కడి చరిత్రవల్ల రత్నాలయ్యాయి. సాలగ్రామం ఎంత విచిత్రమైన రాయి! నీటి ప్రవాహంలో దొర్లుతూ దొర్లుతూ వొత్తిళ్ళకు లోనవుతూ, రాళ్లదెబ్బలు తింటూ, ఎత్తులనుంచి దూకుతూ, లోయల్లో పాకుతూ సుదీర్ఘదూరాన్నీ కాలాన్నీ అనుభవించిన అపురూపశిల సాలగ్రామం. కదలకుండే వుండే మొండిశిల కాదది. సాలగ్రామం లాంటిదే జీవితంకూడా. ఎవడయ్యా గొప్పవాడూ? అంటే, జీవనప్రవాహంలో దొర్లుతూ, దానికి ఒదుగుతూ ఎదురుతిరుగుతూ, తీర్చిదిద్దుకున్న సార్థక జీవితం గలవాడు. నునుపెక్కిన జీవితానికి మరింత చలనశీలం వొనగూడుతుంది. అందుకేనేమో తెనాలి రామకృష్ణుడు తన "పాండురంగమాహాత్మ్యం" లో నిగమశర్మను గురించి చెప్తూ "సాలగ్రామ ఖనిన్ జనించునె గదా జాత్యల్ప పాషాణముల్." అన్నాడు. మంచి కుటుంబంలో నిగమశర్మలాంటి నీచుడు పుట్టాడు. సాలగ్రామాల్లో పిచ్చిరాయి పుట్టినట్టు. జాతిరాళ్లు, జాతిలేనిరాళ్లు అంటూ వుండవు. దాని చరిత్రే దాని జాతి. అన్నట్టు సాలగ్రామ్ పేరుతో నాకో మంచి మిత్రుడున్నాడు. అతడు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పనిచేస్తున్నాడు. అతనికి తప్ప నేనీ పేరు ఇంకెవరికీ వినలేదు. ఈ పేరు పెట్టాలని ఆ తల్లిదండ్రులకెలా తోచిందో.

బూటుకాళ్లతో సాలగ్రామాలని కరకరలాడిస్తూ తీరమంతా కలయతిరుగుతున్నాము. ఈ తీరం ప్రత్యేకత ఏమిటంటే ఇక్కడ, ఈ లోతైన నీటిలో గ్రీకుల ప్రణయ సౌందర్య దేవత వీనస్ ఆవిర్భవించిందని విశ్వవిఖ్యాత ఐతిహ్యం. ఆమె ఈ జలాల అలల నురగల్లోంచి ఒక ఆల్చిప్పలో అవతరించింది. మనకూ ఉన్నాయి ఇట్లాంటి గాథలు. లక్ష్మి పద్మంలో పుట్టింది. సీత పెట్టెలో, మండోదరి కప్పలో; వీనస్‌ను గురించి గ్రీకు పురాణ గాథలు అసంఖ్యాకంగా వున్నాయి. ఈ తీరంలో ఓ ఎత్తయిన పురాతన శిల వుంది. అలల్లో తడుస్తూ, సముద్రానికటువైపు దూరాలను చూస్తూ మనవైపుకు తిరిగి ఏదో మూగ చరిత్రను ప్రసారం చేస్తూ నన్ను ఏదో లోకాల్లోకి తీసుకుపోయిన ఈ శిలను పెత్రో తో రోమయో(Pthro Tou Romeiou) అంటారు. ప్రణయశిల అని అర్థం. రోమయో అంటే ప్రేమ.

రోమియో జూలియట్‌ల కథ గ్రీకులదే. వీనస్ రాక్ అని కూడా అంటారు దీన్ని. ఒకప్పుడు ఈ ద్వీపం గ్రీసు దేశంలో భాగంగా ఉండేదనీ, అనంతకాలక్రమంలో అది విడిపోయిందని ఒక నమ్మకం. వీనస్‌ను అఫ్రొడైట్ దేవత అంటారు. (Aphrodeite diety) సైప్రస్‌ను అఫ్రొడైట్ ద్వీపం అనికూడా అంటారు. ఈ ప్రణయశిలచుట్టూ ఐతిహ్యాలూ చిరంతనజ్ఞాపకాలూ అల్లుకుపోయి ఉన్నాయి. ఈ శిలకు సంబంధించిన Geological Formation సమీపంలో ఉన్న ఇతర శిలలకంటే భిన్నంగా



వీనస్ ప్రతిమ

ఉండటంవల్ల ఓ గ్రీకు హీరో దీనిని ఇక్కడికి విసిరేశాడనే విశ్వాసానికి బలం చేకూరుతున్నది. ఇక్కడ సముద్రం లోతుగా ఉన్నప్పటికీ వీనస్ పుట్టిన జలగర్భం అనే అందమైన నమ్మకం వల్ల ప్రపంచం నలుదిక్కుల్నించి వచ్చిన వేలాది యాత్రికులు జలస్నానాలు చేస్తుంటారు. కోరికలు తీరాలని దాపున ఉన్న చెట్లకు ముడుపులు కడుతుంటారు. రాళ్లమీద జంటలపేర్లు చెక్కుతుంటారు. మానవులంతా ఒకటే.

నీళ్లలోకి దిగలేదుగాని అందరం భావుకలోకంలో ఈదులాడాము. ప్రణయశిలదగ్గర ఫోటోలు దిగాము. అక్కడనుంచి కదలబుద్ధి కాలేదుగాని సాయంత్రం 4గం. సదస్సు ప్రారంభోత్సవం. కార్లు కదిలాయి. ఇంతకుముందు కంటే సైప్రస్ మరింత అందంగా కనపడటం మొదలైంది. వీనస్ పుట్టిన స్థలం అనగానే అదొక మంత్రనగరిగా అనిపించింది. మధ్యధరా సముద్రం నాలోకి ప్రవేశించి ప్రాచీన గాథలతో తడిపేస్తున్నట్టుగా తోచింది. ఇప్పుడైనా కవిత రాకపోతే ఎలా! అప్పటి సద్యోరచనమిలా రూపొందింది.

సముద్రంలోంచి
వీనస్‌ను వింటున్నా.
అనంతాకాశం కింద
ఆ బండరాయి
తరాలుగా నిరీక్షిస్తున్నది
వీనస్ మళ్లీ పుట్టాలని.
బండరాయన్నానా
క్షమించాలి
ప్రణయశిల అది!
ఈ తీరంలో
కన్నీళ్లతో నునుపెక్కిన
సాలగ్రామాలు దొరుకుతున్నాయి.
మన్మథున్ని చంపేశాం మనం.
రతిని కాల్చేశాడా శివుడు!
మధ్యధరా సముద్రానికి
సంయమనం ఎక్కువ
స్త్రీ హృదయానికే పట్టం కట్టింది.
ఓనా బంగాళాఖాతమా
నీకో నమస్కారం!

అందరూ అదే మూడ్‌లో ఉన్నారేమో ఈ కవిత వినిపించగానే స్పందించి ఆనందించారు. ప్రొఫెసర్ డి.సి. రెడ్డి "బంగాళాఖాతాన్ని ఎందుకలా అన్నావు?" అన్నారు. నేను నవ్వేశాను. ఇది స్త్రీలకు పట్టం గట్టిన దేశం. బంగళాఖాతం అఖాతమే అయినా ఉధృతి ఎక్కువ. మధ్యధరాసముద్రం ప్రశాంతజల సమన్వితం. అందుకే స్త్రీ ప్రేమ ఇక్కడ బాగా ప్రకాశిస్తున్నది అని నా భావం. నేనిదంతా ఆయనకు చెప్పలేదు. ఆయన కవిత్వం వినటం, విని ఒక ప్రశ్న అడగటమే విశేషం.

## కామన్‌వెల్త్ స్వాగత సంరంభం

సరిగ్గా 5 గం.లకు లీ-మిరీడియన్ హోటల్‌లోని సాలమినియా రూంలో వి.సి.ల ఫలహార, పానీయాల మధ్య పరస్పర పలకరింపుల సమావేశం జరిగింది. ఇక్కడ సైప్రస్ యూనివర్సిటి వి.సి. ("రెక్టార్" అని అంటున్నారీయన్ని). నికొలాస్ పాపమిఖేల్(Nicolas Papamichael)స్వాగత వచనాలు పలికారు. సైప్రస్‌లో కుప్పబడిన మేధాసంపత్తిని(Intellecual resorces) అభినందించారు. ఈ కాన్ఫరెన్స్ చర్చనీయాంశం కాలంయొక్క తక్షణ అవసరమని, నాలెడ్జ్ ఎకానమీ దిశగా పయనించవలసి వుందని ఆయన స్పష్టం చేశారు. అలాగే స్వాగతం చెప్పిన మరో వ్యక్తి ఎసియు సెక్రటరీ జనరల్ ప్రొఫెసర్ మైఖేల్ గిబ్బన్స్(Michael Gibbons) ఈ సదస్సు ఉత్ప్రేరకమైన మేధోవ్యాపారంగా (Stimulating intellectual programme) పర్యవశించగలదన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

దీని తర్వాత గ్రౌండ్‌ఫ్లోర్ లోని బచ్చూస్ రూంలో( Bacchus Room, వాళ్లు రూం అంటున్నారు కాని పెద్దహాలు) సైప్రస్‌ని గురించిన ఓ ఫిల్మ్‌ని చూపించారు. సైప్రస్ యూనివర్సిటీలోని ఆర్కియాలజి ప్రొఫెసర్ డెమెట్రియస్ మైఖేలిడస్ (Demetrios Michaclides) దీనికి వ్యాఖ్యానం

చెప్పారు. అత్యంత ప్రాచీనమైన సైప్రస్ సంస్కృతి, దేవాలయాలు, ఐతిహ్యాలు, కట్టడాలను గురించి ఆయన సచిత్రంగా వివరించారు. టూరిస్టు గైడ్‌లా కాకుండా ఎకడమిక్ అప్రోచ్‌తో వివరించడం ఇక్కడి ప్రత్యేకత. కొండఅద్దమందు కొంచెమై వుండదా అన్నట్టుగా సైప్రస్‌ను గురించి కొంత అవగాహన ఏర్పడింది. దీని తర్వాత అందరూ తమతమ బసలకు వెళ్లిపోయారు. రాత్రి డిన్నర్. అదంతా మామూలే.

టూరిజం అప్రోచ్ కాదన్నాను కదూ. ఇక్కడ టూరిజాన్ని కూడా అద్భుతంగా అభివృద్ధి పరిచారు. వాళ్లకున్న ఆ కొద్ది చరిత్రను పునాదుల్లోంచి గౌరవిస్తున్నారు. దాన్నొక పర్యాటక ఆకర్షణగా మార్చి కృతకృత్యులయ్యారు. సైప్రస్ ప్రధాన ఆదాయం టూరిజం వల్లే వస్తుంది. ప్రపంచం అన్ని మూలల నుంచి ఏటా 30 లక్షల మంది పర్యాటకులు వస్తున్నారట. ఈ సంవత్సరం ఇంకా ఎక్కువమంది వస్తారని భావిస్తున్నారు.

మరి మనదగ్గరో? మనకు పర్యాటక స్పృహ తక్కువ. మనకు సంస్కృతి ఎక్కువై దాని విలువ తెలియదు. ఉన్న కల్చర్‌ను ఎప్పుడు వదిలించుకోవాలా అనుకుంటున్నాము. ఎంత పాశ్చాత్యమయితే అంత ఆధునికమని కూడా భావిస్తున్నాము. అయితే మన ప్రభుత్వాలు కూడా కళ్లుతెరిచి ఈ మధ్య టూరిజంపైన కొంత దృష్టిని సారిస్తున్నాయి. పర్యాటక ప్రదేశాల్లో లలితకళల్ని ప్రదర్శింపజేసి టూరిస్టులను ఆకర్షిస్తున్నారు. కొన్నాళ్లకి ఆ ప్రదేశాలకి ప్రాచుర్యం ఏర్పడుతుంది. మన నెక్లెస్ రోడ్డు, శిల్పారామం ఇలాంటి ప్రయోగ ప్రక్రియలో ఉన్నవే. దీనిని గమనించి తెలుగు విశ్వవిద్యాలయంలో లలిత కళలతో ప్రమేయం వున్న "ట్రావెల్ అండ్ టూరిజం" పేరుతో రెండు సంవత్సరాల సాయంకాలం డిప్లొమాకోర్సును ప్రవేశపెట్టడం జరిగింది.

రూంలోకెళ్లి కాసేపు విశ్రమించాము. రాఘవులుగారు వస్తానని ఫోన్ చేశారు. ఆయనను రిసీవు చేసుకోవడానికి రూం తెరిచి బయటికి వచ్చాను.

వెనక ధడాలున తలుపు మూసుకుపోయింది. అంతే! మళ్లీ తెరవబోతే రాదు. తెరిచే కార్డు లోపలే ఉండిపోయింది. అప్పుడొచ్చారు చిరునవ్వులు చిందిస్తూ రాఘవులుగారు. ఇంకొక కార్డు తెచ్చుకుందాం పదండి అన్నారు ఆయన. నేను లుంగీ, బనీను మీద వున్నాను. "ఎట్లా?" అన్నాను. "భలేవారే. ఇక్కడెవరు చూస్తారు? అదో ఫాషన్ అనుకుంటారు. పదండి" అన్నారు. రిసెప్షన్‌కి వెళ్లి *"He is locked out"* అన్నారు. వాళ్లు రూంనెంబరు అడిగి మరో కార్డు తీసి కంప్యూటర్ మంత్రంవేసి ఇచ్చారు. ఇలా బయట బంధింపబడటం రెండుసార్లు జరిగింది.

23 ఉదయం నికోషియాలోని అంతర్జాతీయ కాన్ఫరెన్స్ సెంటర్లో సదస్సు ప్రారంభోత్సవ సభ వుంది.

## నికోషియాలో స్వాగత ప్రారంభోత్సవం

లిమసోమాలోని లి.మెరీడియన్ సెంట్ రాఫెల్ హోటళ్లనుంచి 8.45 గం.లకు ఐదు బస్సులు బయలుదేరాయి. అక్కడికి 70 కి.మీ. దూరంలోవున్న నికోషియాకు వెళ్లాలి. నిజానికి దీనికి గ్రీకు పేరు లెఫ్‌కోషియా(Lefkocia) ల్యాటిన్‌లో నికోషియా అంటారు. ఈ మణిప్రవాళ ధోరణి సైప్రస్ జీవనశైలిలో కూడా కనిపిస్తుంది. బస్సులా అవి? రోడ్లే అంటే ఇవి వాటి తాతల్లా వున్నాయి. నేలమీద పాకే విమానాల ఫాయీలో వున్నాయి. రెండు పక్కలా పెద్ద అద్దాలుండి బయటి దృశ్యాలను ప్రసారంచేసే టి.వి. స్క్రీనుల్లా వున్నాయి. డ్రైవరు పేరు ఎలియాస్(Alias). గైడ్ పాలా బయన్సన్ (Pala Bianson). ఆమె బస్సులోకి స్వాగతం పలికింది. బస్సులు కదిలేవేళకి ఒకామె వచ్చి నా పక్కసీట్లో కూర్చుంది. మాటల్లో తెలిసింది ఆమె మరెవరో కాదు ఎసియు సెక్రటరీ జనరల్ గిబ్బన్స్ గారి భార్య. బస్సులు నూటికి మించిన వేగంతో వున్నాయి. బస్సులు పెద్దగా వుండటంవల్ల వేగంగా వెళ్తున్నట్టు అనిపించదు. ఓ చోట స్లొగామారి కాస్త ఆగాయి. ముందేదో



ప్రారంభోత్సవ సభలో పాల్గొన్న ఎగ్జిక్యూటివ్ హెడ్స్

యాక్సిడెంటు జరిగినట్టుంది. అంబులెన్సు, ఫైరింజన్లు ఆగివున్నాయి. ఇక్కడి Rescue వ్యవస్థ సదా అప్రమత్తంగా వుంటుందని చెబుతారు. ఒక్క నిమిషంపాటే ఆగింది ట్రాఫిక్. మళ్లీ అదే వేగం. మా కాన్వాయిని ఒక ప్రభుత్వ ట్రాఫిక్ కారు లీడ్ చేసింది. సైప్రస్ దేశాధినేత ముఖ్యఅతిథులం కదా!

## మెరుగైన విశ్వవిద్యాలయాలదిశగా....

బస్సు దిగినతరువాత మిసెస్ గిల్ గిబ్బన్స్‌గారితో ఫోటో దిగాను. ఆ ఫోటో గిబ్బన్స్‌గారే తీశారు. 9.05గం.లకు సైప్రస్ ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ సెంటరుకు చేరుకున్నాము. వెళ్లగానే అందరికీ ear phone లు ఇచ్చారు. ఈ

కాన్ఫరెన్స్‌కు సంప్రదాయ దుస్తులలో రావచ్చన్నారు. కోటు, బూటు తప్పనిసరి. నేను మా అబ్బాయి కోటు, కొత్తగా కొనుక్కున్న బూట్లు వేసుకొని వెళ్లాను. రాజస్థాన్, శ్రీలంక, ఆఫ్రికా దేశాల పి.సి.లు వారి వారి సంప్రదాయ దుస్తుల్లో వచ్చారు. రాజస్థాన్ తలపాగా ఒక స్ఫురదాకర్షణ.

సరిగ్గా 9.30 గం.లకు సైప్రస్ యూనివర్సిటీ మ్యూజిక్ క్లబ్ విద్యార్థినీ, విద్యార్థులు కమ్మని బృంద గానాలాలపించారు. వాటిలో దేశభక్తి గీతాలు కూడా వున్నాయి. గ్రీకు భాష ఏ మాత్రం అర్థం కాకపోయినా అర్థమైనంత హాయిగా వున్నాయి. అసలు సంగీతమే ఒక భాష. మానవ భాష. ఊపిరి అందరికీ వుంటుంది.. ఊసులు దానికి తొడిగిన పూసలు, అంతే! ఎంత క్రమశిక్షణతో పాడారో. తెరిప్సిహోరియా (Terpsihoria) వారు సంగీతాన్ని సమకూరిస్తే, మిసెస్ నోపి తిలెమాచౌ(Nopi Tilemachou) దర్శకత్వం వహించింది. ఆమె అలలా వూగిపోతూ నిర్వహించిన తీరు కరతాళధ్వనులను కురిపించింది. ఆ పాటల వల్ల ఒక వాతావరణం వెల్లివిరిసింది.

హిజ్ ఎక్సలెన్సి ప్రసిడెంట్ ఆఫ్ రిపబ్లిక్ ఆఫ్ సైప్రస్ మిస్టర్ గ్లాఫ్కోస్ క్లారిడస్(Mr. Glafocos clerides) లాంఛనంగా ప్రారంభించవలసి వుంది. కాని ఆయనెందుకో రాలేదు. తరువాత సైప్రస్ యూనివర్సిటి రెక్టార్ స్వాగతోపన్యాసం చేశారు. ప్రపంచం నలుమూలలనుంచి విచ్చేసి తమ కాలసంపదను, అనుభవ సంపత్తిని వెచ్చించనున్న మేధావులందరినీ ఆయన అభినందించారు. (....invested their time and experience). ఇక ఎసియు సెక్రటరీ జనరల్ మిస్టర్ గిబ్బన్స్ ప్రసంగించారు. ఆయన మాట్లాడుతూ "మనం ఇప్పుడు కొత్త సన్నివేశంలో వున్నాము. యూనివర్సిటీలకు కొత్త బడ్జెట్లులను రూపొందించుకునే సందర్భంలో వున్నాము. యూనివర్సిటీల మధ్య పోటీ పెరుగుతున్న, పెరగవలసిన సందిగ్ధంలో వున్నాం. మన ప్రాధాన్యాలను మార్చుకోవల్సిన స్థితిలో వున్నాము. మెరుగైన విశ్వవిద్యాలయాల నిర్మాణం దిశగా (Better Universities) పయనిస్తున్నాం. ఇదంతా తక్కువ సంసిద్ధతగల (least motivated) సిబ్బందితో, విద్యార్థులతో నెరవేర్చుకోవాల్సిన నిస్సహాయ స్థితిలో వున్నాము.

పోటీ అంటే స్పర్ధకాదు. పరస్పర సహకారం. భాగస్వామ్యం. కొత్త ప్రణాళికలను రూపొందించుకుంటే తప్ప మనమీ లక్ష్యాలను చేరుకోలేం. ప్రపంచ విపణి వీధిని పంచుకోగలిగిన విద్యార్థులను తయారుచేయవలసి వుంది. కొత్త సాఫ్ట్‌వేర్‌లతో పాటు కొత్త కోర్స్‌వేర్‌లను కూడా తయారుచేసుకోవలసి వుంది." ఇలా సాగింది డాక్టర్. గిబ్బన్స్ ప్రసంగం.

తరువాత సైప్రస్ విద్యాశాఖమంత్రి ప్రసంగించారు. ఆయన గ్రీకులో మాట్లాడుతుంటే ఇయర్ ఫోన్సులో ఇంగ్లీషు అనువాదం వినిపిస్తున్నది. ఆయన ప్రసంగిస్తూ "సైప్రస్ యూనివర్శిటీలో 4 పీఠాలు, 13 శాఖలు వున్నాయి. తొందరలో లలితకళాపీఠాన్ని ఏర్పాటు చేయబోతున్నాము." నాకు చప్పట్లు కొట్టాలనిపించింది. అభివృద్ధి చెందిన మార్కెట్ దేశాలు లలితకళలను ప్రత్యేకంగా ఆదరిస్తుంటే మనమేమో వీటివల్ల ప్రయోజనం ఏమిటనే మీమాంసలో కొట్టుమిట్లాడుతున్నాం. ఎంత టెక్నాలజీ అభివృద్ధి చెందినా భాషా సాహిత్యాలు, లలితకళలు లేకుంటే ఆ అభివృద్ధి వాసనలేని పువ్వే. విద్యామంత్రి జాతీయ అంతర్జాతీయ స్థాయిలో సైప్రస్ విశ్వవిద్యాలయం పేరుతెచ్చుకోవాలని ఆశిస్తూ, సైప్రస్ ఆక్రమిత భూభాగం టర్కీనుంచి విముక్తం కావాలని ఆకాంక్షిస్తూ తన ఉపన్యాసాన్ని ముగించారు.

అరుదైన ఈ సభలో అమెరికాలోని పెన్సిల్వేనియా స్టేట్ యూనివర్శిటీలో పనిచేస్తున్న ప్రొఫెసర్ సి.ఆర్. రావుకు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేయడం ప్రధాన ఆకర్షణ. సంతోషం ఏమిటంటే ఆయన తెలుగువాడు. భారతీయుడు సరేసరి. పూర్తిగా పరాయి సన్నివేశంలో మా హృదయస్పందనలే కరతాళ ధ్వనులయ్యాయి. సి.ఆర్. రావు గణాంకశాస్త్రవేత్త (Statistician) ప్రపంచంలోని అనేక దేశాలకు సలహాదారు. డాక్టరేటు ప్రదానం చేసే ముందు ఆయన బయోడేటాను వినిపిస్తుంటే ఎకడమిక్ రాక్షసుడనిపించాడు. 400 పబ్లికేషన్స్, 14 గ్రంథాలు రచించాడు. 50 మంది డాక్టరేట్లకు పర్యవేక్షకుడిగా వున్నాడు. ఇదివరకే

ఆయనను 23 గౌరవ డాక్టరేట్లు వరించాయి. మన భారతదేశంలో ఇదివరకే పద్మభూషణుడు. ఈ సంవత్సరమే పద్మవిభూషితాలంకృతుడయ్యాడు. ఈయన రావు ప్రత్యేకతేమిటంటే గణాంకశాస్త్రంలో సిద్ధాంతానికీ, దాని అనువర్తనకు (Theory and application) మధ్య సమతౌల్యం (balance) పాటించడం. "Rao's Theroem" ని కనిపెట్టాడు. Mathematical Statistics లో ఆయన దిట్ట.

తనకు జరిగిన గౌరవానికి సమాధానం చెప్తూ సి.ఆర్. రావు "ఒకప్పుడు గణాంకశాస్త్రాన్ని అబద్దాల పుట్ట అనుకునేవారు. (Statistical lies) ఇంక ఇప్పుడు అబద్దాలు లేవు. ఈ శాస్త్రాన్ని విశ్వశాంతికి వినియోగించుకోవచ్చు" అని అన్నారు.



ప్రొఫెసర్ సి.ఆర్. రావుకు గౌరవ డాక్టరేట్ ప్రదానం

# ప్రపంచీకరణ అంటే....

ఇక సైప్రస్ మాజీ అధ్యక్షుడు డా. జార్జ్ వసీలియన్ (Dr. George Vassilion) కీలకోపన్యాసం ఇచ్చారు. ఈయన గ్లోబలైజేషన్ గురించి చక్కటి వివరాలు తెలియజేశారు. "ప్రపంచీకరణ అనేది ఆర్థికపరమైనది. దీనివల్ల సంస్కృతి, కొత్త ఆలోచనలు, ఇన్ఫర్మేషన్ అండ్ టెక్నాలజీ వంటి వాటికి స్వేచ్ఛా చలనం ఏర్పడుతుంది. దీని వల్ల ఇంటర్నెట్ మన జీవితాల్లోకి దండెత్తి వచ్చేసింది."

"ప్రపంచీకరణ వల్ల బలవంతులు మరింత బలవంతులైతే, బలహీనులు మరింత బలహీనులవుతారు. *(Strong gets stronger weak gets weaker) 97లో ప్రారంభమైన ఈ ప్రక్రియవల్ల ఇప్పటికే 1.5 బిలియన్ల సంఖ్యలో వున్న పేదవాళ్లు మరింత పెరుగుతారు. కాని కంప్యూటర్‌ను ఇంటర్నెట్‌ను నాశనం చేయగలమా? వాటి వేగాన్ని* ఆపగలమా? కాని అదుపు చేయగలమేమో. అదుపుకూడా కాదు మార్గనిర్దేశం *చేయగలమేమో. ఏకవిపణి సరుకులు (Single market goods) వచ్చేస్తున్నాయి. కలిసి పనిచేయటం తప్ప గత్యంతరం లేదు. మీకై మీరు ఏకాంతంగా వుండే పరిస్థితి పోయింది. గ్లోబలైజేషన్ వల్ల ప్రజాస్వామ్యదేశాల్లో మానవ హక్కుల పరిరక్షణ కోసం ఆందోళనలు జరుగుతున్నాయి."* ఇలా సాగింది ఆయన ప్రసంగం.

నాకైతే కొంత భయం వేసింది .గుర్తుపట్టలేనంత కొత్త చిత్రాన్ని ఆయన చూపెట్టాడు. ఆయన ప్రసంగానికి భారతీయ వి.సి.లు ఎక్కువగా ప్రతిస్పందించారు. వారి ప్రశ్నలకు జార్జ్ ఓపిగ్గా సమాధానాలు చెప్పాడు. హైద్రాబాద్‌లోని మన సీఫిల్ వి.సి. ప్రొఫెసర్ ప్రమోద్‌తల్‌గిరి, ఐ.వి. సుబ్బారావుగారూ తమ చక్కటి ప్రతిస్పందనతో మనపేరు నిలబెట్టారు.

ఐరోపా దేశాలకేమిటి, గ్లోబలైజేషన్‌కు అనువుగా వున్న దేశాలవి. మార్కెట్ ఎకానమీలో ఆరితేరినవారు. అదునువస్తే అల్లుకుపోగలిగినవారు. ఆసియా దేశాల పరిస్థితిగాని, ఆఫ్రికా దేశాల పరిస్థితిగాని దయనీయంగా వుంది. మనం కక్కలేము మింగలేము. మిశ్రమ స్పందనలతో కొట్టుమిట్టాడే పరిస్థితి. ఇప్పుడిప్పుడే విద్యలోకి ప్రవేశిస్తున్న కోట్లాది ప్రజలు ఒక్కసారిగా ఇంటర్‌నెట్ స్వప్నాలు కనలేరు. అన్నిరకాల దుస్తులను ఒకే ఇస్త్రీపెట్టెతో చలువచేస్తే కొన్ని చిరిగిపోయే ప్రమాదముంది. స్వేచ్ఛా విపణివల్ల ఒక సంక్షోభం అప్పుడే మొదలయ్యింది. పి.వి. హయాంలో జరిగిన ఈ ఒప్పందం ఇప్పుడిప్పుడే మన అనుభవంలోకి వస్తుంది. "గ్లోబల్ విలేజా? ఎక్కడుందండీ అది?" అని చమత్కారంగా వేసేప్రశ్నలకి ఇక తావుండదు. "ఆ ఒప్పందం తప్పదు. లేనట్టయితే మనకు విదేశీ మారకం లేదు, పెట్రోలు లేదు" అనే నిస్సహాయ పరిస్థితి ఏర్పడింది. గాంధీజీ కలలుగన్న స్వయం సమృద్ధ గ్రామీణ వ్యవస్థ వట్టి ప్రతీకగానే మిగిలిపోయింది. గురజాడ ఎంతో ముందుకు చూస్తూ అంతర్జాతీయ వాదాన్ని ఉద్బోధించాడు. "దేశి సరుకులు నింప వలెనోయ్" అన్నాడు. ఎగుమతులకంటే దిగుమతులే ఎక్కువయ్యాయి. మన సరుకులకు మార్కెట్ తెచ్చుకోవటంలో మనవాళ్లెంత శూరులో బేరీజు వేసుకుంటే తెలుస్తుంది. దేశి సరుకుల మాట అటుంచి విదేశీ సరుకులతోనే దేశాన్ని నింపుకుంటున్నాము. వ్యాపారస్తులు చైనా పేరు వింటేనే భయపడ్తున్నారు. వినియోగదారులదేముంది? ఏది చౌకయితే అది కొంటారు. నేను ఓ నానీ ఇలా రాశాను.

"అప్పుడు శతఘ్నులతో
ఇప్పుడు సరుకుల్తో
చైనా
చరిత్రకో నమస్కారం."

ఇప్పటికే మన దేశంలో రెవిన్యూ అంతా కిందకి చేరటం లేదు. విశ్వవిద్యాలయాలను సొంత వనరులను సంపాదించుకోమనే పరిస్థితి

వచ్చింది. అప్పుడు పెద్ద ఫీజులువసూలు చేయవలసి వస్తుంది. అవి ధనవంతుల పిల్లలకే అందుబాటులో వుంటాయి. పేదపిల్లల గతేమిటి? విద్యను సగభాగమైనా ప్రభుత్వం భరించాలి. భరించక తప్పదు.

అయితే మన లోపాలు మనకున్నాయి. ఐరోపా దేశాలకు మనకు మానవ వనరుల వికాసంలో స్పష్టమైన తేడా వుంది. మన జనాభా మనకోపెద్ద బరువయ్యింది. మన కుటుంబంలో ఒకరు సంపాదిస్తే మిగతావారు నిర్వ్యాపారంగా వుండటంవల్ల మన జీవనస్థాయి తగ్గిపోయింది. పనివున్నవారు సరే పనిచేయని వారి సంఖ్య మనకు గణనీయం. చైనా జనాభాను అదుపు చేసుకోగలిగింది. మనం పిల్లల్ని 'దేవుడిచ్చినకొద్దీ' స్వీకరిస్తున్నాము. సాకలేక విదేశాలకు అమ్ముకోవలసిన దుస్థితిలో పడ్డాము. విదేశాకుఅనకూడదేమో? గ్లోబల్ విలేజ్ కదా!

## అధ్యక్ష భవనంలో భోజన భాజనాలు

ఒంటిగంట కావస్తున్నది. సైప్రస్ దేశాధ్యక్షుడు అందరినీ లంచ్‌కి ఆహ్వానించాడు. అధ్యక్ష భవనంలో లంచ్. 20 నిమిషాల్లో అక్కడున్నాము. అధ్యక్ష భవనం ఆవరణలో సైప్రస్ తొలి అధ్యక్షుడు, సైప్రస్ దేశనిర్మాత ఆర్చ్ బిషప్ మకారియోస్ రెండు నిలువులెత్తు విగ్రహముంది. గొప్పవాడు. మన గాంధీజీలాంటివాడు. ఆయన గురించి నేను తరువాత చెప్తాను. ఇప్పుడు ఆకలేస్తున్నది.

అధ్యక్ష భవనంలో, ఒక విశాలమైన ఉద్యానవనంలో లంచ్ ఏర్పాటు చేశారు. సైప్రస్‌లో తయారయ్యే కమెండేరియన్ అనే వైను, సాఫ్ట్ డ్రింక్సు ఇస్తున్నారు. ఎవరు ఏది సేవిస్తున్నారో మనకు తెలియదు. నాకు ఆకలి దంచేస్తున్నది. ఏమైనా ఘనపదార్థాలొస్తాయేమోనని ఎదురుచూస్తున్నాను. మధ్యమధ్యలో ఏవో పేరు తెలియని పదార్థాలొస్తుంటే తింటున్నాను. సుమారు 400 మంది ఎక్జిక్యూటివ్ హెడ్స్‌తో నిండిన అరుదైన దృశ్యమది.



అధ్యక్ష భవనంలో ఏర్పాటైన విందు సందర్భంగా సైప్రస్ దేశాధ్యక్షుడు , ఆయన సతీమణి, వి.సి.లు ప్రొఫెసర్ సుబ్బారావు, ప్రొఫెసర్ రాఘవులు, ప్రొఫెసర్ వెంకటరామారెడ్డిగార్లతో

అందరూ ఆవరణంతా తిరుగుతూ ఒకరినొకరు మరింత పరిచయం చేసుకుంటున్నారు. అందరూ వారితో వీరితో ఫోటోలు దిగుతున్నారు. ఇంతలో భవనం ముందు సైప్రస్ దేశాధ్యక్షుడు, ఆయన సతీమణితో పాటు ఆవరణలోకి ప్రవేశించారు. అందరూ దేశాధ్యక్షుడితో కరచాలనమే, పలకరింపులు, ఆయనతో ఫోటోలు దిగడంవంటి ఆహ్లాదాలు జరుగుతున్నాయి. అధ్యక్షులవారి సతీమణి భారతీయ సంతతికి చెందిన మహిళ. మహారాష్ట్ర ప్రాంతానికి చెందినదని అన్నారు. ప్రెసిడెంటుతో "We are from India" అనగానే " Oh! She belongs to India" అని ఆమెను చూపించారు. ఆమె భారతీయుల క్షేమ సమాచారాలను అడిగి తెలుసుకుంటున్నారు.

సైప్రస్‌కు మిస్టర్ గ్లాఫ్కోస్ క్లెరిడిస్ అధ్యక్షుడు. సైప్రస్‌లో ఉన్నది అధ్యక్ష తరహా ప్రభుత్వం. ఐదారు పార్టీలదాకా ఉన్నాయిగాని వాటిలో మూడు పెద్ద పార్టీలు. ఇప్పుడు రెండు పార్టీల సంకీర్ణ ప్రభుత్వం నడుస్తుంది. వచ్చే మేలోనే మళ్లీ ఎన్నికలు జరగనున్నాయి.

భవనం పైఅంతస్తునుండి ఓ ఫోటోగ్రాఫర్ ఈ 400 మందిని ఒక్క ఫ్రేంలో బంధించడానికి ప్రయత్నిస్తున్నాడు. బంధించాడు కూడా. ఆ ఫోటోను ఒక్కొక్కరం 10 సైప్రస్ పౌండ్లు పెట్టి కొనుక్కున్నాము. అది అపురూపమైన



శ్రీలంక విశ్వవిద్యాలయం వి.సి.తో...

ఫోటో. అది తప్పకుండా రాకాశి కెమెరా.

ఆవరణలో ఈ ద్వీపానికే ప్రత్యేకమైన పుష్పమంటూ ఓ తెల్లటి చిన్న

పుష్పాన్ని చూపెట్టారు. ఇది అత్యంత పరిమళ భరితం. పర్ఫ్యూమ్స్ తయారుచేయడానికి విరివిగా వాడతారు. దీనిపేరు యాసెమి (Yaisemi) నాకేదో స్ఫురణకొస్తున్నది. ఇది మన మల్లెపువ్వే యాసమి అనేది గ్రీకు పేరు.



శ్రీలంకలోని పాళీ విశ్వవిద్యాలయం వి.సి.లతో...

యాసమి నుండే జాస్మిన్ (Jasmine) అనే ఇంగ్లీషు మాట పుట్టింది. పువ్వులు గుండ్రముగా నుండును. ఆ గుంపులో ఇద్దరు బౌద్ధ భిక్షువులతో ఫోటోలు దిగాను. ఇద్దరూ శ్రీలంకవారే. ఒకరు టిబెటన్ స్టడీస్‌కు చెందిన ప్రొఫెసర్ గేషా ఎన్ స్యామ్‌టెన్, రెండోవారు బుద్దిస్ట్ పాళీ యూనివర్సిటీకి చెందిన డా. తుంబుల్లే.

ఒక్కొక్కరే బయటికి కదుల్తున్నారు. లంచ్ ముగిసిందన్నారు. అదేమిటి అంటే అంతే అన్నారు. ఎవో గ్లాసులిచ్చారు. ఏవో రెండు ముక్కలు

చేతిలో పెట్టి పోయారు. అంతేనా లంచ్ అంటే. ఇంకేదో భోజనం లాంటిది వస్తుందనుకున్నాము. ముందే తెలిస్తే ఆ ముక్కలే ఎక్కువగా తినేవాళ్లం అనిపించింది.

"Cold Stuff with warm smile" అంటూ మేడం సరస్వతీరావు గారు పెదవి విరిచారు. తిండికంటే ప్రోటోకాల్స్ ఎక్కువ. "ఆతిథ్యంలో మనల్ని మించినవారు లేరు" అన్నారామె.

## సైప్రస్ విభజనలో ముక్కలైన గుండెలు

అధ్యక్ష భవనంలో లంచ్ ముగించుకొని బస్సుల్లో బయలుదేరాం. లెఫ్కోషియా చాలా పెద్దనగరం. లక్షా 92 వేల జనాభా. లెఫ్కోషియా అంటే తెల్లని చెట్టు. ఇదిక్కడ విరివిగా కనిపిస్తుంది. ధవళ, నీలి వర్ణాల సమ్మిశ్రితంగా వుంటుంది(Whitish blue). అధ్యక్ష భవనం ఇంటి పక్కనే వున్న విదేశాంగ మంత్రిత్వశాఖ కార్యాలయాన్ని దాటాము. చైరన్ ఎవెన్యూ గుండా వెళ్తున్నాం. ఇక్కడ ఎంబెస్సీలున్నాయి. చరిత్రను పరికిస్తే నికోషియా ఎన్ని దండయాత్రలను భరించిందో? రక్కని వాడిదే పాపం. వెయ్యేళ్లనుంచి ఇదే రాజధానిగా వుంది. గ్రీన్‌లైన్ వైపు తీసుకెళుతున్నారు. గ్రీన్‌లైన్ అంటే సైప్రస్‌కు ఆక్రమిత సైప్రస్‌కు మధ్య మొలిచిన ఐదు కిలోమీటర్ల గోడ. ఈ గోడవల్ల నికోషియా రెండు ముక్కలయ్యింది. పెద్దముక్క, చిన్నముక్క. గోడ పక్క నుంచి వెళ్తున్నాము. గోడకవతలనుంచి, చువ్వల్లోంచి టర్కీ యువకులు చూస్తున్నారు. గజాల దూరమే. గోడవల్ల వారిమధ్య యుగాల దూరంగా మారింది. వారి ముఖాల్లో కోపం, విచారం కలగలిసి కనిపించాయి. ఇది నా ఆలోచన కావచ్చు.

చెక్‌పోస్టు దగ్గర బస్సులాగాయి. యునైటెడ్ నేషన్స్ జోక్యం వల్ల ఇది తటస్థ ప్రదేశంగా (Neutral Zone) మారింది. ఆ ప్రదేశంలో బాంబుల్లో

శిథిలాలుగా మారిన భవనాలు అలాగే వున్నాయి. ఈ ప్రదేశంలోని లక్షకు పైగా జనం తమ విలువైన ఆస్తులను వదిలిపెట్టి గ్రీక్ సైప్రస్‌లో, అంటే స్వదేశంలోనే కాందిశీకులయ్యారు. ఇటువైపు ఎంత పునరావాస సానుభూతి వున్నా వారికెప్పటికైనా తమ స్వస్థలాలమీదే ఆశా నిరాశలుంటాయి.

ఈ ప్రదేశానికే బఫర్‌జోన్(Buffer Zone) అని కంట్రోల్డ్‌జోన్ అని, పీస్ కీపింగ్‌జోన్ అని అనేక పేర్లతో వ్యవహరిస్తున్నారు. ఇవన్నీ ఐక్యరాజసమితి పెట్టిన ముద్దుపేర్లు. ఇక్కడ "శాంతి" ఉందికాని, ఇక్కడనుంచి తరిమివేయబడ్డవారికి శాంతి లేదు. బస్సులు వేగాన్ని తగ్గించి ఓ చోట ఆగాయి. ఓ కూలిన భవనందగ్గర రెండు బ్యానర్లు కనిపించాయి. వాటిపైన రెండు నినాదాలు రాసి ఉన్నాయి.

"HUMAN RIGHTS COMPAIGNERS
PROVE YOUR SINCEARITY"

"PROVE YOUR HUMANITY
STOP TURKISH INHUMANITY"

వీటి వెనుకవున్న ఆవేదన ఎవరిని మాత్రం కదిలించకుండా వుంటుంది. నిన్ననే "Faces of an island" పేరుతో సైప్రస్ కవుల కవితా సంకలనం ఇంగ్లీషు అనువాద ప్రతి చేతికందింది. సైప్రస్ కవుల కవిత్వం కావాలన్న నా కోరిక మేరకు ఫస్ట్ సెక్రటరీ సుబ్బారావుగారు సంపాదించిన కానుక. 25 ఏళ్ల క్రితం సైప్రస్ రెండు ముక్కలయ్యింది. ఒక తరం గడుస్తున్నది. అప్పటి పిల్లలు ఇప్పుడు యువకులై వుంటారు. అప్పటి యువకులు ఇప్పుడు వృద్ధులై వుంటారు. ఏమైనా అదొక అంతులేని వేదన. నేనిప్పుడు చెప్పిన సంకలనంలో క్లేరీ అంగేలీ దౌ (Klairi Angeli Dou) అనే కవయిత్రి కవితలో ఈ ఆర్తి కనిపిస్తుంది. చదవండి.

## The uprooting 1976

One would say, we never had a home.
We found ourselves in the midst of the world,
with broken hearts.
With fingers fumbling for crystals crushed
fumbling in huge
bags of compassion
for anything warm.
we found ourselves naked,
Thirsty for love
with burning eyes
in darkness thick,
searching for a roof
that of our home
Thirsting for trees
reaching out for love
-from our homes.
We too, had once, a home
a yard, a garden.

బస్సులు బరువుగా కదులుతున్నాయో, నా మనస్సో తెలియదు. ఈ గోడను హరితరేఖ అంటున్నారు కాని, నిజానికి ఇది రక్తరేఖ. ఈ మధ్యనే బెర్లిన్ గోడ కూలిపోయింది. బహుశా ప్రపంచంలో మిగిలివున్న చివరిగోడ ఇదే. "ఈ గోడ పాడుగాను. ఇది కూలిపోవాలి. కూలిపోవాలి" అని మనస్సులో అనుకున్నాను. మనుషుల మధ్య కూల్చవలసిన చివరిగోడ ఇదే కావాలి! ఇదే కావాలి! నికోషియా టౌన్‌హాల్ దాటుతున్నాం. కుడివైపు ఆర్చి బిషప్ మకారియోస్ నివసించిన భవనం కనిపించింది. ఆవరణలో ఆయన

నిలువెత్తు విగ్రహం. ఆయన గురించి ముందు ముందు చెప్తాను. నాలుగ్గంటలకల్లా మళ్లీ ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ సెంటరుకు చేరుకుని అక్కడి "స్నేహమందిరం" (సదస్సు హాలు పేరు)లో అడుగుపెట్టాము. అక్కడ ప్రపంచస్నేహం ఎంత వెలుకుతుందో చూడాలి.

నాలుగ్గంటలకు కామన్‌వెల్త్ సెక్రటరీ జనరల్ న్యూజీలాండ్ మాజీ విదేశాంగ మంత్రి ప్రసంగం ప్రారంభమయ్యింది. ఇది రెండో ప్లీనరీ సమావేశం. ఈయన ఐరోపా కూటమి(EU) సన్నివేశంలో ప్రపంచీకరణ గురించి మాట్లాడారు. ఇది ఖండాంతరీకరణ అవుతుందిగాని (Continentalisatio) ప్రపంచీకరణ ఎలా అవుతుంది అని కొందరు గుసగుసలు పోయారు. ప్రపంచీకరణ అంటూ వస్తే నేషనలిజం నాశనమవుతుందని, ఆదర్శవాదం అంతరిస్తుందని ఆయనకుకూడా తెలుసు. అందుకే దానికి ప్రతిఘటనలెదురవుతున్నాయని ఆయన అన్నారు.

## యూనివర్సిటీస్ 21

అలాగే 5 గం.లకి మూడో ప్లీనరీ సమావేశంలో Mrs Lee Bee Wah, Dr. Jeff Southerton ఇద్దరు ప్రైవేట్ పబ్లిక్ సెక్టార్ల దృక్కోణంతో ప్రపంచీకరణ గురించి మాట్లాడారు. మొదటామె సింగపూర్‌లో ఒకరుకంటే ఎక్కువ కాంట్రాక్టర్లు వారి మధ్య భాగస్వామ్యంతో భారీ ప్రాజెక్టులు ఎలా విజయవంతమవుతున్నాయో వివరించారు. అలా రెండోవారు ఇంగ్లాండుకు చెందిన ఒక ప్రొఫెసర్ అదే పంథాలో మాట్లాడారు.

ఈ రోజుకిక సదస్సు కార్యకలాపాలు ముగిసినట్టే. అక్కడి నుంచి 6 గం.లకి సైప్రస్ యూనివర్సిటీని సందర్శించడానికి బయలుదేరాం. సైప్రస్ యూనివర్సిటీ చిన్నది. 11 ఏళ్ల క్రితమే దానిని స్థాపించారు. ప్రస్తుతం ఒక

అకాడమీ బిల్డింగులో నడుస్తున్నది. వేరేచోట దీనికోసం ఒక పెద్ద క్యాంపస్‌ను నిర్మిస్తున్నారు. ఈ యూనివర్సిటీలో మొత్తం విద్యార్థుల సంఖ్య 2300. అంతర్జాతీయంగా ఉన్నతస్థాయిని పొందాలని ప్రయత్నిస్తున్నది. దానికి ప్రభుత్వం తోడ్పాటు చాలావుంది. లేకపోతే ఇంత పెద్ద కార్యక్రమాన్ని ఎలా నిర్వహిస్తారు? ఆ రాత్రికి 8 గం.లకు మామా హోటళ్లు చేరుకొని హాయిగా నిద్రపోయాము.



సైప్రస్ విశ్వవిద్యాలయం

24 ఉదయాన మెరిడీయన్ హోటల్లోనే వేరు వేరు గదుల్లో వివిధ అంశాలపైన సదస్సులేర్పాటయ్యాయి. మొత్తం 11 సదస్సులు. వాటిలో 5 ప్లీనరీ సమావేశాలు, 2 వర్క్‌షాపులు. మూడింటిని కలపటంవల్ల ఒక పరస్పర వినిమయ వాతావరణం ఏర్పడింది. ప్రధానమైన విషయం ప్రపంచీకరణే.



ఆఫ్రికన్ దేశాల వైస్ ఛాన్స్‌లర్లతో. చిత్రంలో ప్రొఫెసర్ వెంకటరామారెడ్డిగారు కూడా ఉన్నారు

ఇండస్ట్రీలతో కొలాబరేషన్, అమెరికానుంచి నేర్చుకోవలసిన పాఠాలు, అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ప్రైవేటు, పబ్లిక్ సెక్టార్ల మధ్య సంబంధాల స్వరూప స్వభావాలు, యూనివర్సిటీకి ఇండస్ట్రీకి మధ్య ఉండవలసిన సంబంధాలు, మేధోసంపద (Intellectual property) విలువ, యూనివర్సిటీలు ప్రసారసాధనాలను ఏ మేరకు ఉపయోగించుకోవాలి తదితర అంశాలను గురించి ఉదయం 9.15గం.ల నుండి 11.15 గం. వరకు ఆసక్తికరమైన అకడమిక్ వ్యాసంగం జరిగింది. అలాగే 11.15 నుండి ఎనిమిది చోట్ల వర్క్‌షాపులు జరిగాయి. వాటిలో యూనివర్సిటీస్ - 21 (21వ శతాబ్దంలో విశ్వవిద్యాలయాలు) Professor Raewyn Dalziel అనే ఆమె ఈ అంశాన్ని స్లైడ్ల ద్వారా ప్రదర్శించారు. ఈమె న్యూజిలాండ్‌లోని అక్ల్యాండ్ యూనివర్సిటీకి డిప్యూటీ వైస్- ఛాన్స్‌లర్. యూరోప్‌లోని కొన్ని యూనివర్సిటీల వైస్ - ఛాన్స్‌లర్లు ఒక కూటమిగా ఏర్పడి Universities 21



ప్రొఫెసర్ సి.ఆర్. రావుతో భారతీయ, ఆంధ్ర వి.సి.లు

అని స్థాపించారు. వారి మధ్య పరస్పర సహకారం మొదలైనవి ఏర్పడ్డాయి. మేము దానిలో చేరొచ్చా అని ఒకరడిగారు. ఆమె దానికి చప్పుడు చెయ్యలేదు. అదీ సంగతి!

ఆమె చెప్పిన అంశాలు బాగున్నాయి. ఒకరి నెట్‌వర్క్‌ను మరొకరు పంచుకోవడం, పరస్పరం సహకరించుకోవడం ఇలాంటివి. మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు సాంకేతికాంశాలను పంచుకోవాలని ప్రభుత్వం భావిస్తున్నది. ఆ మేరకు కొన్ని ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి కూడా.

ఈ ప్రసంగం విని భారతీయ వి.సి.లకు కొంత ఊపొచ్చింది. సాయంత్రం మనం కలిసి ఒక అవగాహనకు వద్దామని కొందరం అనుకున్నాం గాని అది అయ్యే పనేనా! యూరోపియన్ సాలిడారిటీ ముందు మన అఖండ భారతీయ స్ఫూర్తి ఎంత? కనీసం కాసేపైనా ఆ వేడి తగిలింది

కదా అని భావించిన అల్పసంతోషిని నేను.

మొత్తం మీద నాలెడ్జ్ ఎకానమి, మార్కెట్ ఎకానమీల మధ్య దోబూచులాటలతో ఆ రోజు సదస్సు 7 గం.లకు ముగిసింది.

## మళ్లీ తెలుగు భోజనం

ఆ రాత్రి సుబ్బారావు దంపతులు, ఇతర యువ కిశోరాలతో పాటు వచ్చారు. నికోషియాలోని వాళ్లింటికి మళ్లీ డిన్నరుకు పిలిచారు. తెలుగు ప్రేమ, తెలుగు భోజనం. వెళ్లకుండా ఎలావుంటాము. అందరం వెళ్లాము. దానికి కె.ఆర్.ఎస్. శర్మ, అతని శ్రీమతి పద్మజాశర్మ, శర్మ తల్లిదండ్రులు పూర్ణయ్యశర్మ, పుష్పావతి దంపతులు, వరప్రసాద్, అతని శ్రీమతి లక్ష్మి, కె.ఎన్. షాజా, సతీష్, మాధవరావు, హరేకృష్ణ, శ్రీకాంత్ పులిపాక ప్రభృతుల సందడితో ఆ సాయంత్రం నిండిపోయింది. భట్నాగర్ డ్రైవ్ చేస్తున్నాడు. సన్నగా చినుకులు పడుతున్నాయి. సిల్కు జేబురుమాలుతో తుడుచుకున్నంత మృదువుగా వైపర్లు కదులుతున్నాయి. విశాలమైన సముద్రంలో మొలిచిన ఈ చిన్న భూభాగంలో మళ్లీ ఓ విశాలమైన ప్రపంచం ఇమిడి వుంది అన్న ఊహ నన్ను భావలోకంలోకి నెట్టేసింది. మధ్యమధ్య సైప్రస్ కవితల్ని చప్పరిస్తున్నాను. క్రిస్టోస్ మావరిస్ (Christos Mavrris) అనే కవి రాసిన కవిత ఈ వాతావరణానికి బాగా సరిపోయింది. మీరూ వినండి.

## My Soul

Exhausted but proud
roaming at night
like a wounded viper

my friends found
my crazy soul
at the desolate shore.

- How did you end up at this hour
in this infirm land?
they asked her.

- I seek that ship,
the white ship that
will take me straight
to the sky, she said. I want
to open a small corner shop
where I can sell
to angels who stay up late
indigo color by the kilo,
green birds with red wings
rosewater and cigarettes without filter-tip,
the Greek kind.

25వ తేదీనాడు ఎక్కువగా యూరోపియన్ దేశాలకి సంబంధించిన సదస్సులు జరిగాయి. చిన్న దేశాల విద్యార్థుల మొబిలిటీని గురించీ యూనివర్సిటీలకూ, సమాజానికీ ఉండాల్సిన సంబంధాల గురించీ చర్చలు జరిగాయి. వివిధ దేశాల్లో ఉన్న స్కాలర్‌షిప్పుల గురించినవివరాలు ఎంతో ఉపయోగకరంగా ఉన్నాయి. ఒక సెక్టోరియల్ సమావేశంలో "How do Universities Justify their existance" అనే అంశంపైన జరిగిన చర్చ కొంత మందికి చిరాకు కలిగించింది. ఈ ప్రశ్న మార్కెట్ గొంతులు అడుగుతున్నట్టుగా ఫీలయ్యారు. నాలుగున్నరకు ముగింపు సమావేశం

జరిగింది. దానిలో అన్ని సదస్సుల్లో ఉన్న అంశాలను సమన్వయం చేసిచెప్పటం జరగలేదు. అలా చేసివుంటే మొత్తం కాన్ఫరెన్స్ సారాంశం వ్యక్తమయ్యేది.

ఆ రాత్రి Archi Pelago Restaurant లో గాలా డిన్నర్‌ను ఏర్పాటు చేశారు. ఈ డిన్నర్ ఏర్పాట్లలో కాస్త అపశ్రుతి చోటు చేసుకుంది. వారు పేరుపేరునా సీట్లు కేటాయించారు. ఆ కేటాయించడంలో కొంతమంది పేర్లులిస్టుల్లో మిస్సయ్యాయి. కొన్నిపేర్లు Name, Surname ల మధ్య కన్ఫ్యూజన్‌కు గురయ్యాయి. సంఖ్య పెద్దది, హాలు చిన్నది అవటం వల్ల కాస్త తొక్కిసలాట కూడా జరిగింది. ఐ.వి. సుబ్బారావుగారికి వారి పేరుకూడా లేనందుకు కోపం వచ్చింది. "మాకీ డిన్నరు తీసుకోవాలని లేదు, వెళ్లిపోతాం. మమ్మల్ని మా హోటల్‌కి తీసికెళ్లండి" అన్నారు. ఎసియుకి సంబంధించిన Dorathi Garland అనే ఆమె సుబ్బారావుగారిని, నన్ను, ప్రొ. రెడ్డిని స్వయంగా కారులో ఎక్కించుకొని వారిని సెయింట్ రాఫెల్‌లొ, మమ్మల్ని మెరీడియన్‌లో వదిలేశారు. ఆమె అంటారూ "నాకూ కోపం వచ్చింది. మా వల్ల పొరపాటు జరిగినమాట వాస్తవమే. అయినా మీరు కాస్త ఓర్చుకుంటే పొయ్యేది *గదా!*" అంది. నేనామెకు సర్దిచెప్పాను. *"O.K. Let us be friends"* అని ఆమె నవ్వేసింది. రెండు వేరువేరు లోహాలను వెల్డింగ్ చేసేటప్పుడు పుట్టే చిటపటల్లాంటివివి. మొత్తానికి సైప్రస్ యూనివర్సిటి విద్యార్థులుగానీ, ఎసియు నిర్వాహకులుగానీ చాలా ఆప్యాయంగా సమర్థంగా ఏర్పాట్లు చూశారు. అతి చిన్న విషయాలను కూడా పట్టించుకున్నారు. అన్నీ చిరునవ్వు మొహాలే. గ్రీకుస్త్రీల మొహాలు అందమైనవి. చాలావరకు గుర్తుండి పొయ్యేవి. వీనస్ పుట్టినగడ్డ గదా!

## ట్రూడోస్ పర్వతాలు

26 ఉదయం ట్రూడోస్ పర్వతపంక్తులకు ప్రయాణం. ఎన్నో

ప్రత్యేకతలు కలిగిన పర్వతాలివి. సముద్రమట్టానికి 1953 మీటర్ల ఎత్తున అలరారుతున్నాయి. 90 మిలియన్ల సంవత్సరాల క్రితం పృథ్వీ మధ్య భాగంలో నుంచి ఉత్తరీయంలా పైకుబికిన పర్వతాలివి అని చెప్తారు.

ఈ కొండల్లో పరిమళవంతమైన గాలి, ఎన్నో రకాల అపురూపమైన పక్షి జాతులు, జలపాతాలు, అడుగడుగునా వసంతదేవత సాక్షాత్కారం ఉన్నాయి. ప్రతి మలుపులో ఎదురయ్యే అద్భుత దృశ్యసంపద ఈ ప్రాంతం ప్రత్యేకతలు. ఆరోగ్యం దృష్టితో ఇదొక చికిత్సాలయం. అంతేకాదు, ఈ కొండలమీద చిన్నా పెద్దా మఠాలు, ఆశ్రమాలు అనేకం వున్నాయి. ఈ కొండల్లో వడిదిరిగిన కొమ్ములతో మేకలాంటి జంతువులు కనిపిస్తాయి. మేకలాంటి వేమిటి? మేకలే. కాని వీళ్లు Moufflon అంటారు. కొమ్ములు భయంకరంగా వుంటాయిగాని ఇవి వొట్టి పిరికిగొడ్లు.



ట్రూడోస్ పర్వత సందర్శనకు బయలుదేరే ముందు...

బయలుదేరకముందే అన్నీ చెప్పేస్తున్నాను. 10 గంటలకల్లా లీమెరీడియన్ ఆవరణలోకి బస్సులొచ్చేశాయి. అర్ధగంటముందు. ఇంతకుముందు తీరికలేక గమనించలేదుకాని, ఎలావున్నాయి ఈ బస్సులు? విమానాల్లా ఉన్నాయని ఇదివరకే చెప్పాను. ఇవి Olva కంపెనీ బస్సులట. ఈ కంపెనీ మన బెంగుళూరుకు వచ్చేసిందని చెప్తున్నారు.

బస్సులు బయల్దేరాయి. హోటల్‌నుంచి ట్రూడోస్ పర్వతాలకి 44 కి.మీ. దూరం. మెల్లగా వెళ్లాలిగదా! అందుకే ఒక గంటా పదినిమిషాలు పడుతుందని అన్నారు. ఎడమవైపంతా సముద్రతీరం. '74లో దేశం ముక్కలైనప్పుడు సైప్రసంతా దిగ్భ్రమకు లోనయ్యింది. 90 శాతం హోటల్ ఇండస్ట్రీ అంతా ఆక్రమిత సైప్రస్‌లో ఉండిపోయింది. 1980 నుంచే ఇక్కడ



ట్రూడోస్ కొండల దగ్గర ఉన్న చర్చిలో ప్రొఫెసర్ డి.సి. రెడ్డి దంపతులు, కర్ణాటకలోని విశ్వేశ్వరయ్య సాంకేతిక విశ్వవిద్యాలయం వైస్ ఛాన్స్‌లర్ ప్రొఫెసర్ బాలవీరారెడ్డి దంపతులతో..

శీఘ్రతర అభివృద్ధి ప్రారంభమై మళ్లీ నిలదొక్కుకుంది. లిమసోలా నగరం సైప్రస్‌లోని పెద్ద నౌకాశ్రయ కేంద్రం. వ్యాపార పట్టణం. వైన్ ఉత్పత్తికి ప్రధాన స్థావరం. ఇతరత్రా కూడా ప్రాధాన్యం వున్న స్థావరం. ఈ పోర్టుద్వారా ఇజ్రాయిల్, ఈజిప్టు, గ్రీస్, సిరియా దేశాలకు సులభంగా వెళ్లొచ్చు. సైప్రస్‌లో 75 శాతం గ్రీకులు, 25 శాతం టర్కీయులు మిగతా ఇతర దేశీయులు ఉన్నారు. టూరిజమే వీరి ముఖ్య ఆదాయం. సైప్రస్ వైన్ ఇతర దేశాలకు ఎగుమతి చేసేంత ఉత్పత్తి అవుతుంది.

బస్సులు ఓ చౌరస్తాలో ఆగాయి. స్కూలు పిల్లలు డబ్బాలుపట్టుకొని విరాళాలు వసూలుచేస్తున్నారు. ఏప్రిల్ 26,27,28 తేదీలను విరాళాల దినాలుగా ప్రకటించారు. ఓ మహిళ " The Cyprus Anti Cancer Society" అనే ఓ ట్రస్టును ఏర్పాటు చేసింది. దాని కోసం ఈ విరాళాలు.

బస్సులు ముందుకు సాగాయి. నగర వాతావరణం నుంచి అడవి ప్రాంతంలోకి ప్రవేశిస్తున్నాము. కరూప్ పండ్ల చెట్లు కనిపిస్తున్నాయి. ఈ పండ్లనుంచి తేనె తీస్తారట. వాళ్లు తేనె అంటున్నారు. మనమైతే రసం అంటాం. ఈ రసాన్ని ఇక్కడ చాక్లెట్లలో వాడతారు. ఈ చాక్లెట్లు జీర్ణశక్తికి మంచివట. మరి మనదేశంలో ఉత్పత్తి అయ్యే చాక్లెట్లు దంతాలనూ, కడుపునూ పాడుచేస్తాయంటున్నారు.

కరూప్ చెట్లు, ఆలివ్ చెట్లు, ద్రాక్ష తోటలు ఒక్కొక్కటే వెనక్కెళ్లి పోతున్నాయి.

ఏప్రిల్ కాబట్టి ఈ ఋతువంతా ఇక్కడ ఆహ్లాదకరంగా వుంది. ఇంకా వేసవి రాలేదు. వేసవిలో మధ్యధరాదేశాలన్నీ 110 డిగ్రీల ఫారెన్‌హీట్‌ను తాకుతాయి. అదుగో...అల్లదిగో...కొండలమధ్య కింద లోయలో నీళ్లు



ట్రూడోస్ అడవుల్లోని దృశ్యం....

కనిపిస్తున్నాయి. చిన్న డ్యామ్ కట్టారు. కొండలమీదనుంచి రాలిన ఒక్కొక్క బొట్టే నాకు బంగారంలా కనిపించాయి.

నీళ్లంటే గుర్తుకొస్తున్నది. నేను రాజకీయాలకతీతంగా మాట్లాడుతున్నాను. మన దేశంలోనూ నీళ్లున్నాయి. వాటిని వినియోగించుకోవటం తప్ప భద్రపరచటం తెలియదు. మనకొక నీటి పాలసీ లేదు. మన ముఖ్యమంత్రి "నీరు - మీరు" అంటుంటే దాన్ని రాజకీయదృష్టితో చూస్తున్నారుగాని, నిజానికి అదెంతమంచిపని! మనకు అతివృష్టి, అనావృష్టి దృక్పథాలే తప్ప సమన్వయ, సంతులన దృష్టి లేదు. దూరదృష్టి అసలేలేదు.

ఆ లోయలో కట్టిన చిన్న డ్యామ్ అన్నానే దానిని "ఆలమ్ డామ్"



ట్రూడోస్ అడవుల దారిలో ఒక గ్రామీణ ప్రాంతం

అంటారట. ఇటీవలనే సైప్రస్‌లో driest month since hundred years అని నమోదయ్యిందట. వర్షంలేక. లేనివాళ్లకు తెలుస్తుంది నీటి విలువ. మన రాయలసీమలో నీళ్లులేక కష్టలపాలవుతున్నారనేది చారిత్రక పరిశోధనా సత్యం. కర్నాటకకీ మనకీ డామ్ ఎత్తును పెంచటం గురించి ఏకగర్భ సంజాతుల మధ్య శత్రు వాతావరణం నెలకొంటున్నది. నల్లగొండ జిల్లాలో నాగార్జునసాగర్ వుంటుంది. నల్లగొండ జిల్లాల్లోని చౌడునేలల్లో ప్రవహించడానికి కృష్ణమ్మ జంకుతుంది. కాటన్ దొరకు సంధ్యావందనం చేస్తాంగాని, గోదావరి జలాల్ని అనార్ద్ర ప్రాంతాలకు తరలించడానికి మనసొప్పదు. మన రాజకీయవేత్తలు నీటి రాజకీయాలు వొదులుకుంటే మంచిది. దీనివల్ల అన్నీవుండి ఏమీ లేనివాళ్లమవుతున్నాం.

ట్రూడోస్ అడవుల్లోకి ప్రవేశిస్తున్నాము. Wine తయారుచేసే గ్రామాలగుండా వెళుతున్నాము. ఈ గ్రామాలు 12వ శతాబ్దం నుంచి Wine

తయారుచేస్తున్నాయట. కమెండేరియో అనేది ఇక్కడి Wine పేరు. ఇది సైప్రస్ స్పెషల్. కొమాండస్ అనే మిలటరీ కమాండర్ దీన్ని కనిపెట్టాడు. మంచి కమెండోరియోను 10 ఏళ్లు నిలువ వుంచుతారట.

ఇంకో డ్యామ్ వచ్చింది. అది "అలసా" డ్యామ్. అలసా అనేది గ్రామం పేరు. ఈ మార్గంలో ఏప్రిల్ కాబట్టి ఇప్పుడు మంచులేదు కాని, డిసెంబరు చివరినుంచి, మార్చి చివరిదాకా విపరీతమైన మంచు కురుస్తుందట. ఇది పంటలకు మంచిదట.

గత సంవత్సరమంతా 70 శాతం నుంచి 80 శాతం సెం.మీ. వర్షమే కురిసిందట. చాలదుకదా! అయినా అన్ని కొండ గ్రామాల్లోను కరెంటూ, ఫోన్లు వున్నాయి. డబ్బువుంది. కాదనను. ప్లానింగ్ కూడా వుందంటాను. మనకు డబ్బును గురించిన జాతీయ దృక్పథం వుందా?

అయినా వీళ్లు కొండప్రాంతాల్లో అభివృద్ధి ఆలస్యంగా జరుగుతున్నదని అసంతృప్తితో వున్నారు. "లాన్యా" అనే పల్లె చేరుకున్నాము. ఇది Wine ఉత్పత్తికి చాలా ప్రసిద్ధిచెందింది. అక్కడొక అపురూపమైన వృక్షాన్ని చూశాం. దాని వయస్సు 500 ఏండ్లు. లాన్యా పల్లెలో కరెంటు లేకుండా సూర్యరశ్మితో నీళ్లు వేడిచేసుకునే ఏర్పాట్లు చేసుకున్నారు.

సుద్ద నేల అన్నాను కదా. పెద్ద వృక్షాలు కనిపించలేదు. కాని ఇక్కడ పెద్ద చెట్లు మొదలైనాయి. "క్రినోస్ నిక్రా" అంటారిక్కడ. Pine trees అన్నమాట. అంటే మన దేవదారు వృక్షాలే.

10 నిమిషాల్లో "త్రిమిక్లిణి" అనే గ్రామం చేరుకున్నాం. సంస్కృత పదంలా వుంది. తవ్వుకుంటూ పోతే అన్ని ప్రాచీన భాషలు కలిసిపోయే వుంటాయి. విడిపోయిన వీటిని మన చిన్న జీవితాల్లోని పరిశోధనతో కలపడానికి ప్రయత్నిస్తుంటాము. ఈ గ్రామంలో చెర్రీ పండ్ల చెట్లు విరివిగా

కనిపిస్తాయి. 18వ శతాబ్దం నాటి ఓ చర్చికూడ వుంది. "మిస్సల్" పండ్లు కనిపిస్తున్నాయి. ఇవి మన రేగుపండ్లలా వున్నాయి. తిందామంటే భయం. ముందుకే సాగిపోయాం.

అక్కడక్కడా పక్కపక్కల కొండల మీద ఇళ్లు కనిపిస్తున్నాయి. అవి విదేశీయులు కట్టుకున్న ఇళ్ళు. విదేశీయులంటే బ్రిటీషువాళ్లే. వేసవి ఇక్కడ గడిపిపోతారు. బ్రిటిషువాడు నేలనీ వొదల్లేదు, సముద్రాన్నీ వొదల్లేదు, ఆకాశాన్ని వొదల్లేదు. ఆ కాలంలో అంతటా తన ముద్రవేశాడు. ఇప్పటివరకు మన కళ్లు తెరుచుకునేటప్పటికి చారిత్రక సంక్షోభాన్ని అనుభవిస్తున్నాము.

సముద్ర మట్టానికి 1020 అడుగుల ఎత్తుకు చేరుకున్నామన్నారు. ట్రూడో చెట్లు మొదలయ్యాయి. వేల సంవత్సరాలుగా మంచు కురియటం వల్ల వీటి ఆకులు నేలవైపుకు సమాంతరంగా వేలాడుతుంటాయి. ప్రకృతి పరిణామంలో వున్న చమత్కారమిది. అందని ఆకుల్ని మేయటానికి ప్రయత్నం చేస్తూ జిరాఫీ మెడలు సాగాయంటారు మనవాళ్లు.

అలా సాగుతుంటే గవర్నమెంటు ఫారెస్టు స్కూలు వచ్చింది. ఇక్కడ సైప్రస్ విద్యార్థులతోపాటు అన్ని దేశాలవాళ్లు అడవిని గురించి పరిశోధనలు చేస్తుంటారు.

ఇంకాస్త పైకి వెళ్తే అల్లంత దూరాన ఎదురుకొండమీద అధ్యక్ష భవనం కనిపించింది. బ్రిటిష్‌వాడు కట్టిందే. ఇప్పటి అధ్యక్షుడికి వేసవి విడిది. ఈ ప్రాంతమంతా బ్రిటిషువాడు ఆనాడు కట్టిన ఇళ్లున్నాయి. ఆ ఇళ్లలో ఇప్పుడు ప్రభుత్వ ఉద్యోగులు వుంటున్నారు.

ట్రూడోస్ శిఖరాలు ఇంకా 8 కి.మీ. దూరంలో వున్నాయంటున్నారు.

కాపర్ గనులు ప్రారంభమయ్యాయి. సైప్రస్ కాపర్‌కి ప్రసిద్ధి. కాపర్

వల్లే ఇది కాప్రస్ - సైప్రస్‌గా మారింది. ఇది రోజుకు 100 టన్నుల రాగిని ప్రపంచానికి ఎగుమతి చేస్తుంది.

ఒక ఎత్తుకు చేరుకున్నాము. అక్కడ ఒక క్యాంటిన్, ఒక చిన్న షాపింగ్ సెంటర్. అక్కడ బోలెడన్ని సైప్రస్‌కి సంబంధించిన హస్తకళల వస్తువులున్నాయి. ఏది కొందామన్నా రూపాయలు కాలుతాయి. గుమ్మానికి వేలాడే ఓ విలక్షణమైన పూసలపేరు కొన్నాను. దాని ధర రెండు సైప్రస్ పౌండ్లు.



హస్తకళల వస్తు సంచయశాల

అక్కడ అర్ధగంటే సమయముంది. సావకాశానికి సమయంలేదు. అర్ధగంట ముగియగానే అందరం ఆదరబాదరాగా మా బస్సును

చేరుకున్నాం. అంతకుముందు దాకా నా ప్రక్కన ఓ శ్రీలంకన్ కూచున్నాడు. గైడ్ అడుగుతున్నది అందరు వచ్చారా అని. నా పక్కన ఖాళీ. *"One person is missing"* అన్నాను నేను. బస్సు కదలటానికి దానివల్ల రెండు నిమిషాలు లేటయ్యింది. వెనకనుంచి ఎవరోకాని *" The fellow who is missing should raise his hand"* అన్నారు. అన్ని భాషలవాళ్లూ ఒకేసారి ఘొల్లుమన్నారు. ఆ జోకు మాట్రూడోస్ ప్రయాణాన్నంతా ఆహ్లాదపరిచింది. ఇంతకూ జరిగిందేమిటంటే నా పక్కనున్నవాడు ఎక్కడో వెనక్కెళ్లి కూచున్నాడు. నేనిక్కడున్నాను అని అతను చెయ్యెత్తిన తరువాతే మా బస్సు కదిలింది.

ఎదురుగా జూబ్లీ హోటల్ కనిపించింది. 43 ఏండ్ల క్రితం కట్టిన దీనికీ ఓ ఘనమైన చరిత్ర వుంది. అలా దాటి వెళ్లి "మోఫూ" పట్టణం చేరుకున్నాం. మోఫూ అనేది లోయపేరు. లోయ పట్టణ మన్నమాట! ఈ పట్టణాన్ని టర్కీయులు ఆక్రమించారుగాని ఎందుకో ఖాళీ చేసి వెళ్లిపోయారు. ఇక్కడ కొన్ని చెట్లు విచిత్రంగా వున్నాయి. వీటి కొమ్మలు కిందికివొంగి వేలాడేసిన చేతుల్లా వున్నాయి. అవి మొక్కలుగా ఉన్నప్పుడు దట్టంగా కురిసిన మంచుబరువుకు అలా ఏర్పడ్డాయంటున్నారు.

అక్కడినుంచి "పాత్రోమోస్" గ్రామం. సైప్రస్‌లోకెల్లా ఎత్తయిన ప్రదేశంలో వున్న గ్రామం ఇదే. ఇక్కడ కూడా ఒక Forestry కాలేజ్ వుంది. ఇక్కడ శిక్షణ పొందినవారికి వెంటనే ఉద్యోగాలు లభిస్తాయి. ఎక్కడ చూసినా చెర్రీ పండ్ల చెట్లు, ద్రాక్ష తోటలూ విరివిగా కనిపిస్తున్నాయి. "పాత్రోమోస్" డ్యామ్ స్విమ్మింగ్ పూల్‌లా వుంది. ఇక్కడ చలి ఎక్కువ. ప్రతి ఇంటి కొప్పున ఓ చిమ్నీ వుంటుంది. చలికాలంలో వెచ్చదనం కోసం. అలా "మహారస" అనే పెద్దలోయనుదాటి "బెదులాస్" అనే గ్రామాన్ని చేరాము. ఇక్కడి ఇళ్లకప్పులకు మంచు జారిపోయే పద్ధతిలో నిర్మించారు. ఇక్కడినుంచి కనిపించే దృశ్యం అపురూపం. చుట్టూ కొండలు, కింద లోయలు ఇక్కడి ఇండ్లు కొండలమీద వెదజల్లినట్లుగా ఉన్నాయి.

# కిక్కోస్‌మఠం

Kykkos గ్రామం రాబోతున్నది. సైప్రస్‌లోకెల్లా రెండు గొప్ప విశేషాలను చూడబోతున్నాము. ఒకటి ఒక క్రైస్తవ ధార్మిక సంస్థ (Monestry) ఇక్కడేదో మ్యూజియం కూడా వుంది. రెండోది ఆర్చి బిషప్ మకారి యోస్ సమాధి. ధార్మికశాలలో మేరీమాత బంగారుచిత్తరువు వుంది. దీనిని Saint Luke చిత్రించాడట. దీనిని గురించిన శతాబ్దాల చరిత్రను ఇక్కడివారు పవిత్రంగా భావిస్తారు. ఇది పదకొండో శతాబ్దం నాటిది. ఈ చర్చి, ఈ మ్యూజియం, ఆశ్రమం నిర్మించిన తీరు అద్భుతంగా వుంది. ఎటు చూసినా చెక్క నగిషీ కట్టడాలు, బంగారు తాపడాలు ప్రపంచంలోనే అత్యంత శ్రీమంతమైన సంస్థగా చెప్పుకుంటున్నారు. ప్రపంచం నలుమూలలనుంచి భక్తులు విరివిగా విరాళాలందించారు. ఓ మతగురువొచ్చి, మమ్మల్ని సాదరంగా ఆహ్వానించి మ్యూజియం అంతా చూపెట్టాడు. ఇక్కడ Exibits ప్రకాశంగా పలకవు. వేలాది సంవత్సరాల చారిత్రక నిశ్శబ్దాన్ని కడుపులో పెట్టుకొని మౌనంగా మాట్లాడతాయి. ప్రపంచ క్రైస్తవ సంప్రదాయ వారసత్వ సంపదకు ప్రాతినిధ్యం వహిస్తాయి. ఇక్కడ 20 మంది మతగురువులు (Monks) పనిచేస్తున్నారు. ఈ మ్యూజియాన్ని గురించిన ఒక్క గ్రంథాన్ని వి.సి.లందరికీ బహూకరించారు. ఈ ఆశ్రమ దర్శనం నిజంగా ఒక అనుభూతి.

# ఆర్చిబిషప్ మకారియోస్ సమాధి

అక్కడ నుంచి "ఆర్చి బిషప్ మకారియోస్" సమాధిని చూడటానికి వెళ్తున్నాం. ఆశ్రమం నుంచి ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలోనే వుంది.

మకారియోస్ 17 ఏళ్లు సైప్రస్ అధ్యక్షుడుగా వున్నాడు. మూడుసార్లు ఎన్నికయ్యాడు. సైప్రస్ ప్రజలు దేవుడిగా భావించే జాతిపిత ఈయన. ఈయన పాపోస్ ప్రాంతంలో "సనాయ" అనే పల్లెలో పుట్టాడు. పేదరికంవల్ల తల్లిదండ్రులు చర్చికి ఇచ్చేశారు. Boston లో రాజనీతిశాస్త్రం అభ్యసించారు. అతడే ఆర్చిబిషప్ దాకా ఎదిగి ప్రజల ప్రేమాభిమానాలు చూరగొని దేశాధ్యక్షుడయ్యాడు.

బ్రిటన్ నుండి సైప్రస్‌కు 1960లో స్వాతంత్ర్యం సిద్ధించింది. గ్రీకు సంతతికి చెందిన మకారియోస్ అధ్యక్షుడుగా ఉన్నప్పుడూ టర్కీయుడైన Kukiik ఉపాధ్యక్షుగా ఉండేవాడు. 1925లో బ్రిటిషువాడి పాలైన సైప్రస్ స్వాతంత్ర్యం కోసం ఉద్యమాలు జరిగాయి. ఆ ఉద్యమంలోనే గ్రీకులు, టర్కీయుల మధ్య వేర్పాటు బీజాలు పడ్డాయి. ఇక్కడ కూడా బ్రిటిషువాడు విభజించి ఆనందించాడు. సైప్రస్ గ్రీకులు గ్రీసుతో ఐక్యాన్ని కోరుకున్నారు. (దీన్ని Enosis ఉద్యమం అంటారు) టర్కీయులకిది సమ్మతం కాలేదు. బ్రిటన్ ఏదో సర్దుబాటు చెయ్యబోయింది గాని సైప్రస్ గ్రీకులు గెరిల్లా పోరాటం మొదలుపెట్టారు. మకారియోస్ ఈ నేపథ్యంలో ప్రజలకు ఆరాధ్యుడయ్యాడు.

1964లో మకారియోస్ గ్రీస్‌వైపు మొగ్గుచూపడం మతకలహాలకు దారితీసింది. సైప్రస్ గ్రీకులకు అప్పటి గ్రీస్ ప్రభుత్వంతో చేతులు కలపటం ఇష్టంకాలేదు. మకారియోస్ తటస్థంగా వుండిపోయాడు. గ్రీసు ప్రభుత్వం ఊరుకుందా? 1974లో మకారియోస్ ప్రభుత్వాన్ని కూలదోసి తన కీలుబొమ్మ ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించింది. ఇంతలో టర్కీ ఆదరా బాదరాగా తనకందినంత భూభాగాన్ని ఆక్రమించుకుంది. ఇదీ చరిత్ర.

ఇక ఈ సమాధి మకారియోస్ తాను బతికున్నప్పుడే నిర్మింపజేశాడు. మొదటిసారి గుండెనొప్పి వచ్చినప్పుడు అతనికి ఈ ఆలోచన వచ్చింది.

బస్సులు దిగి రెండు ఫర్లాంగులు నడిచిపోతే సమాధి. నాగరికత వాసన లేదు. మకారియోస్ సమాధి నిరాడంబరమైన రాళ్ల నిర్మాణం. సమాధి మందిరానికి తూర్పు పడమర దిక్కు దిశల్లో ఖాళీగా వుండి ఆకాశం కనిపిస్తుంటుంది. వాటిల్లోంచి వెలుతురు వస్తుంది. ఈ ఏర్పాటు ఎందుకంటే మకారియోస్‌కు తన సైప్రస్ ఎల్లవేళలా అన్ని దిక్కుల నుండి కనిపిస్తూ ఉండాలని ఆయన అభిమతమట! ఆ గడ్డతో అంతటి మమేకం పొందింది ఆయన జీవితం, మరణం కూడా. ఆ సమాధిని ఎప్పుడూ దాని వెనుక ఒక గార్డు నిలబడి చేతుల్లో తుపాకీతో కాపలా కాస్తుంటాడు. అతడు విగ్రహంలా వుండి కదలడు. మేము విగ్రహమనే అనుకున్నాం. గైడు చెప్తేకాని తెలియలేదు అతడు మనిషని. అలా వంతులవారీగా నలుగురు గార్డులుంటారట. ఆ కాపలా ఒక ప్రతీక.

అక్కడి నుంచి మళ్లీ Kykkos లో ఉన్న ఏకైక రెస్టారెంటులో అద్భుతమైన లంచ్ ఆరగించాము. ఆ రెస్టారెంటు చుట్టుపక్కల్లో వున్న నేను ఓ షాపులో వీనస్ విగ్రహం కొన్నాను. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చేసినట్టు కనిపిస్తుందిగాని అది అక్కడ దొరికే మెత్తటి తెల్లరాయితో చెక్కిన చిన్న శిల్పం. అవి నగరాల్లో కూడ దొరకొచ్చుగాని ఇక్కడ కొనాలనిపించింది. ఆ షాపువాడు నన్నుచూసి "మీరు ఇండియనా" అన్నాడు. "అలాగా మా షాపులో ఓ ఇండియా అమ్మాయి పనిచేస్తుంది. పరిచయం చేస్తాను" అన్నాడు. ఆమె బొంబాయి పిల్ల. నన్ను చూడగానే మొహమంతా వికసించింది. "మీకు హిందీ వచ్చా అంది" . గ్రీకు, లాటిన్ తప్ప నాకేదైనా వచ్చు అనుకున్నాను. "ఇక్కడికెలా వచ్చావమ్మా" అన్నాను. "అదంతే" అంది. "బొంబాయిలో మీ వాళ్లకేమన్నా చెప్పమంటావా?" అన్నాను. మా అక్కవుంది అని ఫోన్ నెంబరు ఇచ్చింది. బొంబాయిలో దిగగానే ఫోన్ చెయ్యడం కుదరలేదుగాని హైదరాబాద్ చేరినతరువాత ఫోన్ చేసి చెప్తే వాళ్ల అక్క ఎంత సంతోషించిందో...!

బస్సులు కిందికి మళ్లాయి. కిందికేగాని వచ్చిన మార్గంలోకాదు. ఒక

మంచి వ్యూపాయింట్ దగ్గర దిగి ఫోటోలు తీసుకున్నాం. సుబ్బారావుగారికి ఏ మొక్కా చెట్టూ కనబడ్డా పరిశీలించడం, వ్యాఖ్యానించడం అలవాటు. నిజమైన రైతు బిడ్డ. ప్రొఫెసర్ రెడ్డికి కూడా ఈ అభిరుచి స్వతహాగా వుంది. అప్పుడప్పుడు సాంకేతిక కవచాన్ని సౌందర్యదృష్టి చీల్చుకొస్తూ వుంటుంది.

ఆరుగంటలకల్లా లిమసోలా చేరుకున్నాము. రేపు సాయంత్రమే మా తిరుగు ప్రయాణం. గందరగోళంగా వున్న సామాన్లన్నీ సద్దుకోవాలి. ప్రొఫెసర్ రెడ్డి ఇక్కడినుంచి ఇటలీకి వెళుతున్నాడు. ఇన్నాళ్లు అందరం కలిసి సందడిగా వుండటం వల్ల ఒక్కడే వెళ్లాలంటే కాస్త ఇబ్బంది పడుతున్నాడు. నేనలా ప్లాన్ చేసుకోలేదు. వెళ్లివుంటే రోమ్ నగరాన్ని చూసే అవకాశం కలిగేది. దేనికైనా సమయం రావాలి.

ఈ రోజు 27. ఈ రోజే తిరుగు ప్రయాణం. మనస్సు ఇండియావైపు మళ్లుతున్నది. సాయంత్రం నాలుగు గంటలకు సైప్రస్ ఎయిర్‌పోర్టుకు బస్సులు బయలుదేరుతాయి. కాని 12 గంటలకే మెరిడీయన్ హోటల్‌లో రూములు ఖాళీ చేయవలసి వుంది. అది Check out లెక్క. లంచ్ చేసిన తరువాత కాసేపు కునుకు తీద్దామనుకున్నాము. రిసెప్షన్‌లో అడిగాం కూడా. "మరొకరు రాకుంటే ఒంటిగంటదాకా మీరుండొచ్చు" అన్నారు. మీరు నాలుగుదాకా ఈ ఆవరణలో తిరగొచ్చు అన్నారు. అది కొంత మొరటుగా అనిపించినా అదొక System. నాకు పానశాలలోని దువ్వూరు రామిరెడ్డి పద్యం గుర్తుకొచ్చింది. "అంతములేని ఈ భువనమంత పురాతన పాంథశాల" జీవితంకూడ హోటల్ రూంలాంటిదే. హోటల్‌లో స్థిరనివాసం వుంటుందా? ఇది టూరిస్టు నగరం. ఒక అల వస్తుంది. మరొక అల వెళ్లిపోతుంది.

దానివల్ల మేలు కూడా జరిగింది. అందరం రిసెప్షన్ సమీపంలోని విశాలమైన ఆవరణలో సమయాన్ని సద్వినియోగం చేసుకున్నాము. అందరు వి.సి.లకు వారి వారి సమస్యలున్నాయి. మేడం విద్యావతిగారన్నారు "సార్! మే నాలుగో తేదీతో నా టర్మ్ అయిపోతుంది" అన్నారు. "కంగ్రాచ్యులేషన్స్"

అన్నాను. "అలలమీద నావలా ఎంతదూరం నడిపించగలిగితే అంతదూరం నడిపించారు. మీకేంటమ్మా! మీరు బాగాచేశారు" అన్నాను. ఆ క్షణంలో నాకు తెలియదు ఆమె పదవీ విరమణ తరువాత కాకతీయ విశ్వవిద్యాలయం ఇన్చార్జ్ వైస్‌ఛాన్స్‌లర్‌గా నన్ను వేస్తారని. అక్కగారినుంచి చార్జ్ తీసుకోవలసి వస్తుందని.

నాలుగు గంటలకు ఎయిర్‌పోర్టుకు బస్సులు బయలుదేరాయి. బస్సు అద్దాలను మేఘాలనీడలు కోస్తున్నాయి. ఎక్కడ పుట్టామో? ఎక్కడ పెరిగామో? 7000 మైళ్ల దూరంలో వున్న ఈ ద్వీపాన్నీ, ఈ గాలినీ, ఈ నీళ్లనీ, ఈ నేలనీ కాసేపు ఆస్వాదించే అవకాశం వచ్చింది. ఇది చిన్నదేశం కాబట్టి, చిన్నదేశంలో అన్ని దేశాలను పరామర్శించ గలిగాము. మేధోపరంగా ఈ సదస్సు ఒక గొప్ప exposure. ఈ మేఘాల్లోని చెమట కిందికి ఏ చినుకుగా రాలుతుందో? బస్సులో ఓ కవిత రూపు దిద్దుకుంటున్నది. ఇంత అనుభవాన్నిచ్చిన సైప్రస్‌మీద కవిత రాకపోతే ఎలా? ఓ సారి వినరూ?

## సైప్రస్

ఆకాశం నుంచి
మధ్యధరా సముద్రంలో రాలిపడ్డ
స్వప్నబిందువులా వుంది సైప్రస్.
రాత్రంతా నిద్రపోని
లిమసోలా నగరం ముంగురుల్లోంచి
జారిన గులాబిపువ్వులా వుంది
చుట్టూ మొసళ్లున్నా
వాటిని మచ్చిక చేసుకున్న అందాల చేపలావుంది.

ట్రూడోస్ కొండలపైన ఘాట్‌రోడ్డు
మెలికలు తిరిగిన స్తబ్ద గీతంలా వుంది.

ఎప్పుడో ఓ వాహనం అలికిడికి
కదిలే ప్రవాహ మవుతుంది.

సైప్రస్!
ప్రేమైక దేవత
వీనస్‌ను కన్న జలగర్భం నీది.
ఇప్పుడు
గ్రీకుసుందరి కళ్లలోంచి రాలిన
కన్నీటి చుక్కలా వున్నావు.
వీనస్‌ను చేతులారా చంపుకున్నావు
దేహం మొండిదయ్యింది గాని
ప్రేమ కోటికోటి హస్తాల్తో అలలెత్తుతూనే వుంది.

సైప్రస్!
ఎన్ని దెబ్బలు తిన్నా
దండయాత్రల్లో గుండెముక్కల్ని ఏరుకున్నా
మొన్నటికి మొన్న
ఒక ఊపిరితిత్తిని పోగొట్టుకున్నా
ప్రాణవాయువులాంటి ప్రేమతో
పచ్చపచ్చగా నవ్వుతున్నావు.
సున్నపురాళ్లలో సైతం
అన్నం పుట్టిస్తున్నావు.
అనంతప్రేమను నింపుకున్న అగాధగాథలతో
అందరినీ పిల్చుకుంటున్నావు
సైప్రస్!
సీకరిదీరియా
కరిస్తా.*

* సీకరిదీరియా- అభినందనలు, కరిస్తా- కృతజ్ఞతలు

తిరుగు ప్రయాణంలో ఉన్న విశేషాలన్నీ చెప్పి మిమ్మలను విసిగించను. చిన్న చిన్న తేడాలతో అంతా అలాగే జరిగింది. డా. రెడ్డి దుబాయి నుంచి వేరే రూటు చూసుకున్నాడు. వెళ్లేటప్పటికి, వచ్చేటప్పటికీ ముంబాయి ఎయిర్‌పోర్టులో చెకింగ్ ఏర్పాట్లలో తేడా వుంటుంది.

ఎయిర్‌పోర్టు నుంచి బయటపడగానే బంగాళాఖాతంమీద గొడుగులా వున్న ఆకాశం కనిపించింది. ఆంధ్ర మహాసభ అధ్యక్షుడు కొత్తపల్లి రమేష్‌బాబు, ఇతర మిత్రులు రిసీవ్ చేసుకున్నారు. ఆ రోజు మధ్యాహ్నం అతనింట్లో జరిగిన లంచ్‌కి ఎందరో తెలుగు మిత్రులు వచ్చారు. తెలుగు కష్టాలు, తెలుగు సుఖాలు మాట్లాడుకొని ఎయిర్‌పోర్టులో ఛత్రపతి శివాజీకి వీడ్కోలు చెప్పాము. ఇంటికి చేరగానే నా భార్య ఎదురుచూస్తున్నది. స్వదేశానికొచ్చిన అనుభూతి కలిగింది. నా భార్య చిరునవ్వులతో వెలుగుతున్న ఇంట్లోకొచ్చి పడ్డాను. గృహమే కదా స్వర్గసీమ!

